ప్రజాపక్ష

# సమీక్ష

(ఇది పాత్రికేయుల పక్షపత్రిక)

నమూనా సంచిక | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | వెల రు. 5-00

సంపాదక వర్గం :
గౌరవ సంపాదకులు :
ఎబికె ప్రసాద్
సంపాదకులు :
వి. హనుమంతరావు
విద్యా భూషణ్
ఎన్. వేణుగోపాల్
డి. పాపారావు

లోపలి పేజీల్లో.....



చందా వివరాలు.....
వార్షిక చందా రూ॥ 120/-లు

Edited, printed and published by
V. Hanumantha Rao
for Samata Publications
D.No. 8-3-898/22, Road No.3,
Nagarjuna Nagar,
Hyderabad - 500 073.
Phone : 3748672

Printed at : Charita Graphics
Chikkadpally, Hyderabad - 020.

## దుర్భిక్షం - కరవు పరిస్థితులు : ప్రసిద్ధ ఆర్థిక వేత్తల హెచ్చరిక

**కేవలం** ప్రకృతి వైపరీత్యాలను ప్రజల దుస్థితికి కారణంగా చూపి ప్రభుత్వాలు తప్పించుకు తిరిగే రోజులు పోయాయి. ఆధునిక శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం చేతికి అందివచ్చిన ఈ రోజున, గతంలో మాదిరిగా గుడ్లు అప్పగించి అతివృష్టి, అనావృష్టి దుష్పలితాలను భరించి కూర్చోవలసిన అవసరం లేదు. కాకపోతే ప్రజలకూ, పంటలకూ, పంట పొలాలకూ వైపరీత్యాలవల్ల వాటిల్లే భారీ నష్టాలను ముందుజాగ్రత్త చర్యలద్వారా చాలవరకు తగ్గించుకొనగల అవకాశాలు గతంలో కన్నా ఇప్పుడెక్కువగా ఉన్నాయి. అయితే ఈ వైపరీత్యాల సందర్భంగా ప్రధానంగా జాగ్రత్తపడవలసింది ఎక్కడంటే - తోటి మానవుల వల్ల కలిగే కృత్రిమ వైపరీత్యాల విషయంలో ధాన్యాదులు, నిత్యావసరాల బ్లాక్ మార్కెటింగ్‌కు పాల్పడే శక్తులవలన, ధాన్యం పంపిణీ విషయంలో, ధరలను అదుపు చేసే విషయంలో పాలకులు అనుసరించే ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా నిత్యం జాగరూకులై ఉండవలసి ఉంటుంది. ఈ ఏడాది దేశంలో సగానికి సగం రాష్ట్రాలు (12 రాష్ట్రాలకుపైగా) వర్షాభావంవల్ల తీవ్ర దుర్భిక్షానికి లోనయ్యాయి. నాట్లు పడలేదు, కనీసం రెండు మాసాలకు పైగా వర్షాలు వెనకడుగు పట్టాయి. ఆంధ్రప్రదేశ్‌లో 840 మండలాలు దుర్భిక్షంలో ఉన్నాయి. రబీ సీజన్‌కు సిద్ధపడవలసిన సమయం ఆసన్నమవుతున్నప్పటికీ ఖరీఫ్, పంటలే చేతికి రాని దుస్థితిలో రాష్ట్రం చిక్కుకుంది. ఖరీఫ్‌లో (జూన్‌లో) 30 లక్షల హెక్టార్లతో పడవలసిన నాట్లు వర్షాభావం వల్ల 4.11 ల హెక్టార్లకే సరిపెట్టుకోవలసివచ్చింది. 85 శాతం మేర వరి సాగు తగ్గింది. వరల్డ్‌బ్యాంక్ సంస్కరణల ఫలితంగా ఇప్పటికే రైతాంగం బ్యాంకుల నుంచి పరపతి సౌకర్యానికి దూరం కావలసిన పరిస్థితి ఏర్పడింది. రైతులకు అవసరమైన పారిశ్రామికోత్పత్తులు, పనిముట్లు, ఎరువులు, పురుగుల మందుల ధరలు పెరిగిపోవటమే గాక, అందుబాటులో ఉన్నవి కూడా నకిలీ సరుకులుగా మారాయి. విత్తనాలపై పెత్తనం కంపెనీలది కావడంవల్ల నాసిరకానికి తప్ప నోచుకోవడంలేదు. వరల్డ్‌బ్యాంక్ దెబ్బతీసిన పరపతి సౌకర్యం ఫలితంగా వడ్డీ వ్యాపారులపై ఆధారపడి పంటలు దెబ్బతిన్న రైతులు అనేకచోట్ల ఆత్మహత్యలకు పాల్పడ్డారు. రాష్ట్రంలో సుమారు 1 కోటీ 40 లక్షలు మించి వ్యవసాయ కార్మికుల్లో మూడింట రెండొంతులమంది ఉపాధి కరవై అల్లల్లాడుతున్నారు. పనులు లేక అనేకచోట్ల వలసలు ప్రారంభమవుతున్నాయి. ఆలస్యంగా ప్రారంభమైన "పనికి - ఆహారం" పథకాన్ని పాలకులు, పాలకవర్గ పార్టీ ప్రధాన కార్యకర్తలూ దారిమళ్ళించి స్వార్థప్రయోజనాల కోసం దుర్మార్గాలకు దిగారు. (ఇందుకు చెర్లపల్లి, పాలకొల్లు, కల్లూరు లలో బియ్యం పట్టివేతలే నిదర్శనం)!

ఈసారి దేశంలో ముమ్మరించిన దుర్భిక్ష - కరవు పరిస్థితి 1972-73, 1979-80, 1987-88, 1999 నాటి దుర్భిక్షంకన్నా తీవ్రమయిందిగా పాలకులూ, ఆర్థికవేత్తలూ పరిగణిస్తున్నారు. అలాగే 1991 తర్వాత వరల్డ్‌బ్యాంక్ సంస్కరణలను తలదాల్చడం వల్ల సాంఘిక, ప్రజా సంక్షేమ రంగాలపై వెచ్చించే వ్యయాన్ని కోతపెట్టి, ప్రభుత్వరంగ సేవలను తగ్గించడంవల్ల ఉత్పన్నమైన పరిణామాలకు 2001, 2002 సంవత్సరాల్లో వచ్చిన దుర్భిక్షాలను ఉదాహరణగా నిపుణులు పేర్కొంటున్నారు. ద్రవ్యవనరుల కేటాయింపుల్లోనూ, రాజకీయ విధానాల్లోనూ వచ్చిన ప్రజావ్యతిరేక నిర్ణయాల ఫలితంగా రైతుసేవా కార్యక్రమాలు కుంటుపడ్డాయి. వరల్డ్‌బ్యాంకు సంస్కరణల ఫలితంగా కొత్త ప్రాజెక్టుల నిర్మాణం సాధ్యపడకపోగా, ఉన్న ప్రాజెక్టుల మెయిన్‌టెనెన్స్ కూడా ఇబ్బందుల్లో పడింది. గతంలో వచ్చిన దుర్భిక్ష పరిస్థితుల సందర్భంగా సమకూడిన కరువు నివారణ సహాయక కార్యక్రమాలతో పోల్చుకుంటే గత రెండు సార్లుగా వచ్చిన వైపరీత్యాలను ఎదుర్కోవడంతో అందులోనూ వచ్చిన సాయం తగ్గిపోయింది. రాష్ట్రాలు అడిగినంత యివ్వగల స్థితిలో కేంద్రం లేదు. పదవ ఫైనాన్స్ కమిషన్ వైపరీత్యాల సందర్భంగా సహాయక (రిలీఫ్) పనులకు కేటాయించాలని చెప్పిన, రూ॥ 10,000 కోట్లలో కేంద్రం ఈసారి యివ్వగలిగింది రూ. 1800 కోట్లకు కుదించుకుపోయింది! ఈ పరిణామాలు చూస్తుంటే, చరిత్ర గుర్తుకొస్తుంది. నాడు పరాయి పాలకులు బ్రిటిష్ సామ్రాజ్యవాదాలు మన సంపదను దోచి రైతులను, చేతి వృత్తులవారిని బికారీలుగా మార్చారు. "తెల్లవాడి" పాలన పోయి "నల్లవాడి" పాలన వచ్చినా పరిస్థితుల్లో గణనీయమైన మార్పులేకపోగా వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్ని మరోపేరుతో మల్టీ నేషనల్స్ ద్వారా "తూర్పు ఇండియా" పాలన స్థానంలో "వెస్ట్ ఇండియా" (అమెరికా) పెత్తనంలోకి నెడుతున్నారు! అందువల్ల నాడు జాతీయ స్వాతంత్ర్య సమరానికి ఉద్దీపకులుగా ఉన్న సుప్రసిద్ధ ఆర్థిక, సామాజిక శాస్త్రవేత్తలు, ఆర్థిక రంగంలో స్వావలంబన సూత్రంపై ఆధారపడి జాతీయ దృక్పథంలో ఆర్థిక విధానాలకు రూపకల్పన చేసిన దాదాభాయ్ నౌరోజి, ఆర్.సి.దత్, రనడే, భోలానంద చంద్ర, బాలగంగాధర తిలక్‌లను ఈ సందర్భంలో గుర్తుచేసుకొనక తప్పదు. వీరు దాస్య చరిత్రలోని కరువు కాటకాల గురించి, ప్రజలపైన, సమాజంపైన వాటి దుష్ఫలితాల గురించీ ఆనాడు ఎన్నో హెచ్చరికలు చేశారు. 19వ శతాబ్దంలో ఇండియాలో వచ్చిన 18 కరవు కాటకాల్లో నాల్గింటిని కిరాతకమైన దుర్భిక్షానికి, కరవుకూ ఉదాహరణలుగా పేర్కొన్నారు. 1940లలో వచ్చిన బెంగాల్ కరువు డాక్టర్ అమర్త్యసేన్ తదనంతర స్వాతంత్ర్యానంతర భారతంలో వస్తున్న పరిణామాల అధ్యయనానికి పరిశీలనాంశంగా మారింది. కేంద్రం వద్ద మేటవేసుకున్న 6 కోట్ల టన్నుల ఆహారధాన్యాల గురించి మురిసిపోతే చాలదు. వాటిని శరవేగాన దుర్భిక్షం వాతపడిన రాష్ట్రాలకు హుటాహుటిన తరలించి, సక్రమ పంపిణీకి పకడ్బందీగా ఏర్పాట్లు చేయాలి. అన్ని రకాల రుణాల వసూళ్ళను (రైతాంగానికి సంబంధించి) నిల్పివేయాలి. వరసగా మూడేళ్ళకు అంతకుపైబడిన బకాయిలను రద్దు చేయాలి. "ఫామిన్ కోడ్" ను ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా సవరించుకుని అమలు జరపాలి. 1950 నాటి కేంద్ర మార్గదర్శక సూత్రాలను, 1995 నాడు సవరించిన, ఎ.వి.ఎస్. రెడ్డి రూపొందించిన 1995 నాటి కరువు మాన్యువల్ సిఫారసులను తక్షణం అమలులోకి తేవాలి.

- ఎబికె

## సంతానోత్పత్తి శిశుఆరోగ్యం (ఆర్‌సిహెచ్) ప్రైవేటుపరం

- ఆర్.సి.హెచ్ కి నిధులను మాత్రం ప్రభుత్వం ద్వారా రావాలి. కాని వాటి అమలు మాత్రం ప్రైవేటురంగానికి అప్పజెప్పాలని ప్రపంచబాంకు ఆదేశించింది.
- ప్రభుత్వం కలుగజేసే సదుపాయాలను సమర్థవంతంగా ఉపయోగించుకోవడానికి ప్రైవేటు డాక్టర్లకు ఎక్కువ ప్రోత్సాహకాలను యివ్వాలి.
- వెనుకబడ్డ ప్రాంతాల్లో పరిశ్రమల స్థాపనకు ప్రభుత్వం ఎలా ప్రైవేటు సంస్థలను ఆకర్షిస్తుందో అలాగే సుదూర ప్రాంతాల్లో ప్రైవేటు ఆరోగ్య సంస్థలను ప్రోత్సహించాలి.
- గర్భ. నిరోధక, సూక్ష్మ పోషకాహారం సృష్టిలో ప్రైవేటు సంస్థలను ప్రోత్సహించాలి.
- ఐ.ఇ.సి. కార్యక్రమాల్లో ప్రైవేటు సంస్థలు చొరవ తీసుకునే విధంగా ప్రభుత్వం నిధులను అందించాలి.
- ఈ కార్యక్రమానికి అవసరమైన సామగ్రిని సరఫరా చేసే వ్యాపారంలో బడా వ్యాపారుల బహుళజాతి సంస్థల ప్రవేశానికి పునాది ఏర్పాటు అవుతుంది. అంతర్జాతీయ వేలం ప్రకారం బడా కాంట్రాక్టర్లకు కాంట్రాక్టులనివ్వాలి.

# సంస్కరణల సేద్యంలో పేదరికపు పంట!

- డి. పాపారావు

పేదరికాన్ని కొలిచేందుకు, వాడే కొలబద్దల విషయంలో ఆర్థిక శాస్త్రవేత్తల మధ్య ఏకాభిప్రాయంలేదు. అయితే, ఏదో ఒక కొలబద్దను ప్రామాణికంగా స్వీకరించకుండా మనం పేదరికాన్ని అంచనా వేయలేము. అందుచేత అంతర్జాతీయ దారిద్ర్యరేఖ కొలబద్ద అయిన రోజుకు ఒక డాలరులోపు (1993 సం॥ కొనుగోలు శక్తి మారకం ఆధారంగా) ఆదాయంవున్న వారిని దారిద్ర్య రేఖ దిగువవున్న వారిగా పరిగణనలోకి తీసుకుంటూ మన పరిశీలనను సాగిద్దాం. దీని ప్రకారంగా భారతదేశంలో సంస్కరణల అనంతర కాలంలో, అంటే 1990వ దశకం ఆరంభం నుంచి పేదరికం తీరు తెన్నులను మనం ఈ కొలబద్ద ఆధారంగా పరిశీలన చేయవచ్చు. గౌరవడాల్ మార్టిన్ రెవేలియన్‌ల పరిశోధనల ప్రకారంగా 1990 దశకపు సంస్కరణల కాలంలో భారతదేశంలో పేదరికం తగ్గలేదు. వాస్తవానికి తొలినుంచి గ్రామీణాభివృద్ధి, మానవ వనరుల అభివృద్ధి తక్కువగా వున్న రాష్ట్రాలలో ఆర్థిక అభివృద్ధి అనబడే దాని ప్రభావం పేదరికంపై సానుకూలంగా లేదు. అయితే భారతదేశంలో పేదరికం నిర్మూలనకు ఆర్థిక అభివృద్ధి అనేది కేవలం ఒకానొక అంశంగా మాత్రమే వున్నది. కాబట్టి భారతదేశ ఆర్థిక వ్యవస్థలో స్థూల జాతీయ ఉత్పత్తి గురించిన ఎన్ని కాకిలెక్కలు చెప్పినా, అవి అన్నీ దేశంలో పేదరికం స్థాయి తగ్గిందనటాన్ని నిరూపించలేవు.

ఆదాయపరంగా ప్రపంచంలోని పేదవర్గాలలోని అత్యధిక సంఖ్యాకులు భారతదేశంలోనే నివసిస్తున్నారు. (రోజుకు డాలరు లోపు ఆదాయం కలవారి కొలబద్ద ప్రకారంగా) 1990 వ దశకం మధ్యకాలపు లెక్కల ప్రకారంగా, ప్రపంచంలోని అత్యంత నిరుపేదలలో 1/3వ వంతు వరకు భారతదేశంలోనే వున్నారు.

1960, 1970 దశకాలలో స్థూల జాతీయ ఉత్పత్తి పెరుగుదల రేటు సాలీనా 3.4% వుంది. అంటే తలసరి ఆదాయం వార్షిక ప్రాతిపదిక 1% మాత్రమే పెరిగింది. కాగా 1980 దశకం మధ్యభాగం నుంచి జాతీయ ఉత్పత్తి పెరుగుదల రేట్లు సరాసరిన గణనీయంగా వుండటం గమనార్హం కాబట్టి, మొత్తం మీద 1990వ దశకపు ముందస్తు కాలపు ఆర్థిక ఎదుగుదల భారతదేశంలో పేదరికం తగ్గింపుదిశగా సాగింది. 1958-1991 కాలంలో జాతీయ ఆర్థికాభివృద్ధి వలన పేదరికం రేఖ దిగువన వున్నవారు లబ్ధిపొందారనేది నిర్వివాదం. అంతే కాకుండా, 1990వ దశకపు ముందుకాలంలో ఆర్థికాభివృద్ధితో పాటుగా ఆర్థిక వ్యత్యాసాలు కూడా పెరిగి పోయాయి అనటానికి దాఖలాలు లేవు. అయితే 1990వ దశకం మాత్రం ఈ విషయంలో గందరగోళానికి, వివాదాలకు తావుకల్పించింది. కొందరు ఆర్థిక వేత్తల అభిప్రాయం ప్రకారంగా, ఆదశకంలో పేదరికం, భారీగా తగ్గింది. (భల్లా, 2000) కాగా మరికొందరి అభిప్రాయంలో పేదరికం స్థాయిలో మార్పులేదు. వాస్తవానికి పేదరికం ఇంకా పెరిగి వుండవచ్చుకదా. (సేన్, 2001) అయితే, వాస్తవానికి జరిగిందేమిటి అన్నది ఇక్కడ మనం పరిశీలించాలి.

**భిన్న గణాంకాల సేకరణ :**

భారతదేశంలో ఆర్థికాభివృద్ధికి సంబంధించి రెండు భిన్న గణాంక వివరాల సేకరణలు వున్నాయి. వీటిలో ఒకటి జాతీయ నమూనా సర్వే. రెండవది జాతీయ అకౌంట్ల విభాగపు సర్వే. ఈ రెండు సర్వేలను ఉపయోగించుకొని మాత్రమే మనం సరియైన నిర్ధారణకు రాగలం. జాతీయ అకౌంట్ల సర్వే లాభాపేక్ష లేని సంస్థల వ్యయాన్ని, గృహవినియోగాలతో పాటుగా కొలుస్తుంది. కాగా జాతీయ నమూనా కేవలం గృహ వినియోగాన్ని మాత్రమే పరిగణనలోనికి తీసుకొంటుంది. అలాగే జాతీయ అకౌంట్ల సర్వే ఆర్థిక సేవలు, ఇంటి అద్దెలకు అయ్యే వ్యయాన్ని కూడా పరిగణనలోని తీసుకొంటుంది. యిపుడు ఒకమారు వెనక్కి తిరిగిచూస్తే ఈ రెండు సర్వేలమధ్య వైరుధ్యం పెరగటం స్పష్టంగా కనబడుతుంది.

జాతీయ నమూనా సర్వే వినియోగానికి సంబంధించిన అంచనాలను తక్కువగా వేయటం ఒక్కటే, జాతీయ అకౌంట్ల సర్వేతో దానితేడాకు ఏకైక కారణం కాదు. ఉదాహరణకు, పేదల ఆదాయ వినియోగంలో 60% మేరకు ఆహారానికే ఖర్చు అవుతుంది.

కాగా, మనం జాగ్రత్తగా పరిశీలిస్తే జాతీయ నమూనా సర్వే, సర్వేచేసే తీరులో 1990-2000 సం॥ల మధ్య తేడా వచ్చిందని గుర్తించవచ్చు. ఈ తేడావలన, ఆ సర్వే తాలూకు గణాంక వివరాలు ప్రశ్నార్థకంగానే మారుతున్నాయి. 1950వ సంవత్సరంలో సర్వేలను ఆరంభించినపుడు ఎన్.ఎస్.ఎస్. వినియోగానికి సంబంధించి 30 రోజుల కాలాన్ని పరిగణనలోకి తీసుకొంది. కాగా 1994-1995 సం॥ నుంచి రెండు భిన్న భిన్న నమూనాలకు ఎన్.ఎస్.ఎస్. రెండు భిన్న తరహాల వినియోగ తీరులను కొలబద్దగా తీసుకొంది. ఒక నమూనాకు 30 రోజుల కాలాన్ని, మరో నమూనాకు 7 రోజుల కాలాన్ని కొలబద్దగా తీసుకొంది. ఆహారం, పాన్, పొగాకు, మత్తు పదార్థాలకు సంబంధించి 7 రోజుల కాలాన్ని కొలబద్దగా తీసుకొంది.

వంట చెరకు, దీపాలు మొదలైన వాటికి సంబంధించి 30 రోజుల వినియోగ కాలాన్ని పరిగణనలోనికి తీసుక్కొంది. ఇక విద్య, వైద్యం, దుస్తులు, పాదరక్షలు వంటి వాటికి సంబంధించి 365 రోజుల కాలాన్ని పరిగణనలోనికి తీసుకొంది. అయితే 1999-2000 సం॥ గాను ఎన్.ఎస్.ఎస్ సర్వే మరింత ఆందోళనకరమైన తీరులో కూడా వ్యవహరించింది. ఆ కాలానికి సంబంధించి ఒకే తరహా గృహస్తులకు ఆహార వినియోగానికి సంబంధించి రెండు రకాల నమూనాలను స్వీకరించింది.

(7రోజులు మరియు 30రోజులు:ఈ రెండు నమూనాలు)

ఈ రెండు నమూనాలకు సంబంధించిన ఒకే ప్రశ్నాపత్రం లో ప్రశ్నలను ప్రక్కప్రక్కన వుంచింది. దీనివలన, ఆ రెండు నమూనాలకు సంబంధించి గృహస్తుల జవాబులు ఒకేరీతిలో వచ్చే అవకాశం పెరిగింది. 1999-2000 సం॥లకు గాను ఎన్.ఎస్.ఎస్. సేకరించిన గణాంక వివరాలను విశ్లేషించగా వచ్చే వివరాలు 7 రోజుల కాలానికి ఒక రకంగాను, 30 రోజుల కాలానికి ఒక రకంగాను (ఆహార పదార్థాల విషయంలో) వుండే అవకాశం వుంది. 30 రోజుల కాలాన్ని పరిగణనలోకి తీసుకుంటే (ఇతర తేడాలను విస్మరించి) దేశంలో పేదరికం తగ్గినట్లుగా కనబడుతుంది. ఈ లెక్కల ప్రకారమే ప్రణాళిక సంఘం (2001) దేశంలో పేదరికం స్థాయి 1993-94, 1999-2000 సం॥ల మధ్య 36% నుంచి 26% తగ్గిందని చెబుతుంది. మరోప్రక్క 7 రోజులు కాలాన్ని పరిగణనలోకి తీసుకుంటే గ్రామీణ పేదరికం 2% పెరిగినట్లు, నగరప్రాంతపేదరికం 5%పెరిగినట్లు కనబడుతుంది.

## వాస్తవ ధోరణి యిలా వుంది :

మొత్తం మీద భారతదేశంవంటి విశాలమైన దేశంలో ఏ గణాంక వివరాలనైనా వివిధ ప్రాంతాల విడివిడి అంకెలు లేకుండా పరిశీలించలేము. ఈ రకంగా చూస్తే 1990వ దశకంలో ప్రాంతీయ అసమానతలు బాగా పెరిగాయి. అంతేకాకుండా భారతదేశానికి గ్రామాలు ఆయువుపట్టు వంటివని మరువరాదు. ఈ గ్రామీణ ప్రాంతాలలో స్థూల జాతీయ ఉత్పత్తి పెరుగుదల మొత్తం దేశీయ స్థూల, జాతీయ ఉత్పత్తులతో పోలిస్తే సగానికి సగంగా వుంది. 1993-94, 1999-2000 సం॥ల మధ్య భారతదేశపు స్థూల జాతీయ ఉత్పత్తి 6.7% పెరగగా, వ్యవసాయం, సంబంధిత రంగాలలో మాత్రం ఈ పెరుగుదల సాలీనా కేవలం 3.2% మాత్రంగానే వుంది. గ్రామీణాభివృద్ధిలోనూ, ముఖ్యంగా పేదరికం నిర్మూలనలో గ్రామ ప్రాంతాల అభివృద్ధి అంశాన్ని పరిగణనలోనికి తీసుకోకుండా వుండలేము. చారిత్రకంగా చూసినా, ఇతర దేశాలతో పోల్చినా మనదేశ గ్రామీణ ప్రాంతాలలోనే 'పేదరికం' ఎక్కువగా వుంది. 1960-90 సం॥ల మధ్య గ్రామీణ పేదరికం రేటు, పట్టణ ప్రాంత పేదరికంతో పోలిస్తే 1.1 - 1.2 గా వుంది. కాగా 1990వ దశకంలో ఈ తేడా పెరిగి 1.4కు చేరుకుంది. ఇక, రాష్ట్రాలవారిగా చూస్తే కేరళలో పేదరికం బాగా తగ్గింది. ఆ తరువాతి క్రమంలో అస్సాం, బీహార్ వున్నాయి. అయితే, మొత్తం మీద దేశంలోని అతిపెద్ద రాష్ట్రాలు జనాభా ఎక్కువగా వున్న రాష్ట్రాలలో పేదరికం తగ్గుదల అనేది, మొత్తం దేశవ్యాప్త పేదరికం తగ్గుదలలో కీలకాంశం కాగా, వాస్తవానికి ఈ రాష్ట్రాలలో పేదరికం తగ్గుదల (1990వ దశకంలో) జరగలేదు. దీనిని బట్టి 1990వ దశకపు సంస్కరణల కాలంలో పేదరికం తగ్గిందని కొన్ని సర్వేలు తెలపడం హాస్యాస్పదం.

## సంస్కరణల కాలంలో వ్యవసాయరంగేతర అభివృద్ధి :

ఈ రాష్ట్రాలలో అభివృద్ధి నామమాత్రమే. ఇక వ్యవసాయ రంగంలో ఎదుగుదలకూడా ఈ రాష్ట్రాల్లో పేదలకు అనుకూలంగా లేదు. కాబట్టి బీహార్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్ వంటి రాష్ట్రాలలో గణనీయమైన స్థాయిలో వ్యవసాయేతర, వ్యవసాయ రంగాలలో అభివృద్ధి అనేది, దేశవ్యాప్త పేదరికం స్థాయిలో తగ్గుదలకు కీలకం. కాని ఇలా జరగలేదు. మార్పులు చేసుకుని ఎన్.ఎస్.ఎస్. చేసిన సర్వేల ఫలితాలు, దేశంలో వాస్తవిక పేదరికస్థాయిని సూచించలేవు.

చారిత్రక తీరు తెన్నులను ఆసరాగా చేసుకొని పేదరికం స్థాయిలో మార్పులను ఒకసారి చూద్దాం. ఈ వివరాలు 1960-94 మధ్యకాలానివి. 1960, 70, 80వ దశకంలో జరిగిన తీరులోనే అభివృద్ధి జరిగివుంటే 1990వ దశకంలో పేదరికంస్థాయి గణనీయంగా తగ్గివుండవలసింది. 1993-94వ సంవత్సర కాలపు స్థాయి అయిన 39.1% నుంచి పేదరికం స్థాయి 1999-2000 సంవత్సరాల నాటికి 34.3% నికి తగ్గివుండవలసింది. అంటే ఇది వార్షిక రేటున 0.8 శాతం పాయింట్లమేరకు వుడాలి. ఈ తగ్గుదల గతకాలపు (సంస్కరణల ముందరి) తగ్గుదలకంటే ఎక్కువగానే వున్నట్లుగా భావించవచ్చు. కాగా వాస్తవానికి ఈ తగ్గుదల వివిధ అంచనాల ప్రకారంగా కేవలం 0.65 శాతంగా మాత్రమే వున్నది. (ఒకవేళ మనం వాటిని విశ్వసించి నప్పటికీ). కాగా, 1990వ దశకంలోని స్థూలజాతీయ ఉత్పత్తి పెరుగుదల రేటుతో పోలిస్తే 0.8 శాతం పాయింట్ల వార్షిక పేదరికం తగ్గుదల కూడా తక్కువస్థాయిదే. దీనర్థం జాతీయ సంపద పెరుగుదలతో అధికభాగం ధనాధిక వర్గాలకే దక్కుతోంది. ఆర్థికాభివృద్ధి శాతంలో సంస్కరణల అనంతర కాలంలో పేదల వాటా తగ్గు ముఖం పట్టింది.

## అభివృద్ధి పథంలో ఎందుకీ తేడాలు :

ఆర్థిక అభివృద్ధి అనబడేదాని ప్రభావం కొన్ని రాష్ట్రాలతో పేదరికంపై హెచ్చుగా వుండడానికి, ఇతర రాష్ట్రాలలో తక్కువగా వుండడానికి కారణం ఏమిటనే ప్రశ్న ఇక్కడ మనకు వస్తుంది. అభివృద్ధి క్రమం ఆరంభదశలో వున్న అసమానతల తీవ్రత దీనికి ఒక కారణం. రుణసదుపాయాల మార్కెట్లో వున్న లోపాలు మరో కారణం. అలాగే, ఇక నిరక్షరాస్యత, కనీస విద్యలేకపోవడం వేరొక కారణం. ప్రస్తుత ఉదారవాద ఆర్థిక విధానాలు ఈ సమస్యలకు సమాధానం ఇవ్వలేవు. దీనివలన దేశవ్యాప్తంగా చూస్తే పేదరికం పెరుగుదలతో పాటుగా, ప్రాంతీయ అసమాన తలు కూడా తీవ్రం అవుతున్నాయి.

## గ్రామీణ పేదరికం :

1970, 1980 దశకాల కాలంలో గ్రామీణ పేదరికం గణనీయంగా తగ్గింది. 1973-74 సంవత్సరంలో 55%గా వున్న గ్రామీణ పేదరికం 1989-90 నాటికి 34% నికి తగ్గింది. అయితే 1990వ దశకంలో ఈ పరిస్థితి మారిపోయింది. ఈ కాలంలో గ్రామీణ పేదరికం స్థాయి అంతకు మునుపటి 34% నుంచి తగ్గకపోగా, అది పెరిగి పెరిగి 42% చేరుకుంది. కాగా, అధికారిక గణాంక వివరాలు మాత్రం భిన్నమైన కథనాన్ని వినిపిస్తున్నాయి. మార్కెట్లను సరళీకరించడం, విదేశీ పెట్టుబడులు మార్కెట్లోకి ప్రవేశించేందుకు వున్న నిబంధనలను సరళీకృతం చేయడం, ఎగుమతులను (ముఖ్యంగా వ్యవసాయ రంగంలో) ప్రోత్సహించ డం వలన ఉపాధి అవకాశాలు పెరుగుతాయని, పేదరికం తగ్గుతుందని ఉదారవాద మార్కెట్ వ్యవస్థను సమర్థించేవారు చెబుతూ వచ్చారు. అయితే, కొద్దో గొప్పో తమకు అనుకూలం గానే సాగిన ఎన్.ఎస్.ఎస్ సర్వేలు సైతం దీనికి భిన్నమైన పరిస్థితిని సూచించడంతో వీరు ఇరకాటంలో పడుతున్నారు. అందుకే ఎన్.ఎస్.ఎస్ సర్వే నమూనా మరీ చిన్నదిగా వుందనీ, గ్రామీణ ప్రాంతంలో వినియోగస్థాయిని తక్కువగా అంచనా వేసిందనే కుంటి వాదనలు ముందుకు వస్తున్నాయి.

పేదల వినిమయ వస్తువులలో ఆహారం వాటా 60%గా ఉంటుందని ముందే చూసాం. ఈ పదార్థాల ధరలు 1990వ దశకంలో బాగా పెరిగాయి. వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతు లను ప్రోత్సహించడం, ఆహార సబ్సిడీలపై తలసరి వ్యయాన్ని తగ్గించడం వంటి స్థూల ఆర్థిక వ్యవహారాలు దీనికి కారణం. దీనంతటి వలన తలసరి నిజ ఆహార వినియోగం పెరగకుండా ఉండి పోయింది. దీనివలన గ్రామీణ పేదరికం పెరిగింది. ఇక, గ్రామీణ ప్రాంతాలలో ఉపాధి అవకాశాల కల్పన పరిస్థితి కూడా గ్రామ పేదరికాన్ని తగ్గించేందుకు సానుకూలంగా లేదు. మొత్తం జాతీయ ఆదాయంలో గ్రామీణ విభాగపు వాటా గణనీయంగా పడిపోయింది. దీనికి కారణం వ్యవసాయక ఆదాయాలు, వ్యవసాయేతర ఆదాయాలకంటే తక్కువగా పెరగడం మాత్రమే కాదు. మొత్తం గ్రామీణ ఆదాయాలలో వ్యవసాయేతర ఆదాయాల వాటా 1990-91 కాలం తరువాత పెరుగుదల లేకుండా ఉండిపోవడమే దీనికి ప్రధాన కారణం.

1993-94వ సంవత్సరం ప్రాతిపదికగా వేసిన జాతీయ ఆదాయాల నూతన వరుసక్రమ అంచనాలు వ్యవసాయ ఉత్పత్తి బాగా పెరిగిందని సూచిస్తున్నాయి. అయితే పండ్లు, కూరగాయల, పూల ఉత్పత్తులు మొదలైనవాటికి వ్యవసాయ ఉత్పత్తులలో హెచ్చు ప్రాధాన్యత నివ్వడం దీనికి కారణం. దీనంతటి వలన, ఈ కాలంలో ఈ తరహా పంటల వాటా మొత్తం వ్యవసాయ ఉత్పత్తిలో 50 శాతానికి మించి చూపబడుతుంది. కాగా, ప్రస్తుతం అందుబాటులో ఉన్న గణాంక వివరాల ప్రకారంగా గ్రామీణ విభాగంలో వాస్తవిక అంచనాల ప్రకారంగా తలసరి ఉత్పత్తి పెరుగుదల రేటు 1980వ దశకంలో 3.1 శాతం మించి, 1990వ దశకంలో 1.8 శాతానికి పడిపోయింది. దీనికి చాలా కారణాలు ఉన్నాయి. మొదటిది గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర ఉపాధి అవకాశాలు కుప్పకూలిపోవడం. ఇక రెండవది పండ్లు, కూరగాయల విభాగంలో మినహా మిగతా వ్యవసాయక రంగంలో ఎదుగుదల లేకపోవడం. ఇవి ప్రధాన అంశాలు. ఎందుచేతనంటే 1970, 1980 దశకాలలో గ్రామీణ ప్రాంతాలలోని వ్యవసాయేతర రంగాలలో ఆదాయ సముపార్జన అవకాశాలు గణనీయంగా పెరిగాయి. దీనికి కారణం ప్రభుత్వం గ్రామీణ ప్రాంతాల్లో హెచ్చు మొత్తాల్లో కేటాయింపులను వినియోగించడం. ఆ కాలంలో నూతనంగా సృష్టించబడిన ఉపాధి అవకాశాల్లో దరిదాపు 60 శాతం గ్రామీణ ప్రాంతాలకే దక్కాయి.

## 90వ దశకంలో ఉపాధి :

సంస్కరణల ముందుకాలంలో (1983 నుంచి 1993-94 దశాబ్దం) ఉపాధిని కల్పించగల ఆర్థిక వ్యవస్థ సామర్థ్యం సాలీనా 2.7%గా వుంది. గత 9 సంవత్సరాల కాలంలో ఈ సామర్థ్యం 1.07%నికి పడిపోయింది. మరోప్రక్క స్థూలజాతీయ ఉత్పత్తి నుంచి, సంస్కరణల కాలంలో 6.7%నికి పెరిగింది. సంస్కర ణలు సమాజంలోని పై వర్గాలవారికే లాభం చేకూర్చాయన డానికి ఇదే తార్కాణం. 1993-94 సంవత్సరం తర్వాత సంఘటిత రంగంలో ఉపాధి అవకాశాలు దరిదాపు "సున్నా" స్థాయికి పడి పోయాయి. ప్రభుత్వ రంగ పరిశ్రమలలో వున్న ఉపాధి అవకాశాలు కూడా కృశించి పోతున్నాయి. గతంలో సంఘటిత రంగానికి వెలుపల, పెద్ద ఉపాధి కల్పనా రంగంగా వ్యవసాయం వుండేది. అయితే, సరళీకృత విధానాల అనంతరకాలంలో ఈ విభాగంలో కూడా ఉపాధి అవకాశాలు సన్నగిల్లాయి.

దీనంతటివలన, 1993-94 సం॥లో 6 శాతంగా వున్న నిరుద్యోగం, 1999-2000 కాలానికి 7.3 శాతానికి పెరిగింది. షెడ్యూల్డు తరగతుల విషయంలో ఈ నిరుద్యోగ శాతం తరుగుదల 9.6కి పెరిగింది. మొత్తం నిరుద్యోగ సైన్యం సంఖ్య 1999-2000 సంవత్సరాల నాటికి 27 మిలియన్లకు పెరిగింది. ఈ నిరుద్యోగులలో 74% మంది గ్రామీణ ప్రాంతాల్లోనే వున్నారు. వీరిలో 60 శాతం మంది విద్యావంతులే.

ఈ నేపథ్యంలో దేశంలో పేదరికం పెరిగిపోతోంది. పరిస్థితిని ఎంత మసిపూసి మారేడు కాయనుచేసి, కాకిలెక్కలు చెప్పినా ఇది వాస్తవం. సంస్కరణలు ధనవంతులను మరింత ధనవంతులుగాను, పేదలను మరింత పేదలుగాను చేసి వదిలి పెడుతున్నాయి. మధ్య తరగతిని కృంగ దీస్తున్నాయి. ఈ తరగతి వారి పరిస్థితి "ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోత"గా మారిపోతోంది మరి. ■

# దేశంలో..

ఆగస్టు

2. కాశ్మీర్ ఎన్నికల పర్యవేక్షణకు విదేశీయుల రాకకు అద్వాని నో!

తమిళనాడులో ఎల్.టి.టి.ఇ. అనుకూల నాయకుడు నెడుమురాన్‌ను పోటో కింద అరెస్ట్.

సెప్టెంబర్ 16, 24 అక్టోబర్ 1, 8వ తేదీల్లో జమ్మూ- కాశ్మీర్‌లో ఎన్నికలు

శిక్షపడనంతకాలం ఎన్నికల్లో పాల్గొనవచ్చు - అఖిల పక్షం ఏకాభిప్రాయం.

కార్పోరేట్ గవర్నెన్స్ విధానానికి నీళ్ళొదిలిన టాటాలు - మహాజన్.

3. అభివృద్ధి విషయాలపై ఏకాభిప్రాయం అవసరం - వాజ్‌పాయ్.

నన్ను చంపడానికి కుట్ర - యు.పి. ముఖ్యమంత్రి మాయావతి.

పెట్రోలు బంకుల కుంభకోణం - పార్లమెంటులో బట్టబయలు.

4. వర్షాభావ రాష్ట్రాలకు రు. 714.20 కో. కేంద్రం రెండవ విడత సహాయం.

వాజ్‌పాయ్ తన ప్రకటనలను ఆచరణలో పెట్టాలని జాతీయ మానవ హక్కుల కమీషన్ ఛైర్‌మెన్ కోర్కె.

సామాజిక భద్రతను ప్రాథమిక హక్కుగా గుర్తించాలని లేబర్ పానెల్ డిమాండు.

5. రైల్వే జోన్ విభజనకు వ్యతిరేకంగా తృణముల్ కాంగ్రెస్ పిలుపుమేరకు బెంగాల్‌బంద్.

అదనపు కరువు సహాయానికి 9 రాష్ట్రాల డిమాండ్.

6. జనవరి 2000 తర్వాత ఇచ్చిన పెట్రోలు బంకులన్నీ రద్దు చేస్తూ వాజ్‌పాయ్ ప్రకటన.

నేను రాజీనామా చేసే ప్రసక్తేలేదు - మంత్రి రాంనాయక్

ప్రధానితో కాంగ్రెస్ ముఖ్యమంత్రులు, సోనియా భేటీ. కరువు సహాయంలో వివక్షచూపిస్తున్నారని ఆరోపణ.

పెట్రోలియం మంత్రి రాంనాయక్ రాజీనామాకు ప్రతిపక్షాల డిమాండ్. సుప్రీంకోర్టు జడ్జీచే విచారణ చేయించాలి.

తొమ్మిది మంది అమర్‌నాథ్ యాత్రీకులను చంపేసిన మిలిటెంట్లు.

గుజరాత్‌లో రెవెన్యూ మంత్రి హరేన్ పాండ్యా రాజీనామా.

మధ్యప్రదేశ్‌లో 65 సంవత్సరాల మహిళ సహగమనం.

6. ఎన్నికల సలహా బిల్లుకు మంత్రిమండలి ఆమోదం సమాచార స్వతంత్రం బిల్లుకు కూడా ఆమోదం.

ఛీఫ్ విజిలెన్స్ కమిషనర్ నియామకానికి ఆమోదం తెహల్కా జర్నలిస్టు మీద కేసు నమోదు.

జమ్మూ-కాశ్మీర్‌లో గవర్నర్ పాలనకు కాంగ్రెస్ డిమాండ్.

పెరుగుతున్న వరకట్నం చావులపట్ల సుప్రీంకోర్టు ఆందోళన.

పారిశ్రామిక ఉత్పత్తిసూచి గత సంవత్సరం 2.8 శాతం పెరుగగా, ఈ సంవత్సరం 3 శాతం వుండవచ్చునని NCAER అంచనా.

7. తెహల్కా రిపోర్టర్ అరెస్ట్, బెయిల్.

వరుసగా నాలుగోరోజున కూడా పార్లమెంటు స్థంభన

ప్రతిపక్షాలుకూడా బంక్ కోటాకు అప్లికేషన్లు పంపాయని బి.జె.పి.

9. 1983 నుంచి పెట్రోల్ బంకుల కేటాయింపులను విచారించాలి - ఎన్.డి.ఎ. పార్లమెంట్ సభ్యులు.

గుజరాత్‌లో ఎన్నికల సాధ్యాసాధ్యాల గురించి పరిశీలన కోసం ఎలక్షన్ కమిషన్ ప్రతినిధి వర్గం పయనం.

కరువు ప్రాంతాల్లో రైతులకు రుణ సహాయంలో మార్పులు.

10. నాకు పెట్రో ఏజెన్సీలు లేవు - విద్యాసాగర్.

దేశంలో 114 చోట్ల సిబిఐ దాడులు.

విదేశీ మారక నిల్వలు 60 బిలియన్ డాలర్లు.

చీఫ్ ఎన్నికల కమిషనర్ గుజరాత్ సందర్శన.

విశాఖలో సబ్‌మెరైన్ మ్యూజియం ప్రారంభం.

గత సం॥ మే నెలతో పోలిస్తే ఈ సంవత్సరం మే నెలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు 87శాతం పెరుగుదల.

11. ఉపరాష్ట్రపతి ఎన్నిక. అధికారపక్ష అభ్యర్థి రాజస్థాన్ మాజీ ముఖ్యమంత్రి భైరాన్‌సింగ్ షెకావత్ గెలుపు.

రాష్ట్రపతి గుజరాత్ పర్యటనలో మీడియాపై ఆంక్షలు.

కచ్ భూకంప పునరావాసుల పలకరింపుకే మీడియా అనుమతి.

తృణాముల్ ఎన్నిక బహిష్కరణ.

గుజరాత్ ఎన్నికల పరిస్థితుల అంచనాకై పర్యటించి వచ్చిన ఎన్నికల కమీషనర్లు.

ఎన్నికల కమిషన్ ఎన్నికల నిర్వహణ పట్ల కేంద్రీకరించాలని కేంద్ర, న్యాయశాఖా మంత్రి హితవు.

ఉత్తరాంచల్ భారీవర్షాల్లో తెహ్రీ జిల్లాలో 33 మంది మృతి.

పార్లమెంటు నిరవధిక వాయిదా.

12. కాశ్మీర్ సమస్యపై కేంద్ర మాజీ న్యాయ శాఖా మంత్రి రామ్‌జఠ్‌మలానీ నాయకత్వంలోని కాశ్మీర్ కమిటీతో చర్చలకు అఖిల పక్ష హురియత్ కాన్ఫరెన్స్ సుముఖం.

13. పెట్రోల్ పంపుల కేటాయింపులను సుప్రీంకోర్టు పరిశీలనకై కేంద్రం బదలాయింపు.

# రాష్ట్రంలో...

ఆగస్టు

2. 836 మండలాలు కరువుప్రాంతాలు - కేంద్రానికి రు. 810 ఇవ్వాలని వినతి.

హైదరాబాద్‌లో ఖాళీ స్థలాలపై పన్ను తగ్గింపు.

కాశ్మీరులోని రాజౌరి ప్రాంతంలో 31న కెప్టెన్ రాపోలు వీరారాజురెడ్డి మరణం.

రెండు ఎన్‌కౌంటర్లలో 2 మహిళలతో సహా 6 నక్సలైట్లు మృతి.

పట్టణ భూ పరిమితి పెంపు

చదువుల పండగ ప్రారంభం

నీటి సంఘాలకు ఎన్నికలయ్యేదాకా అధ్యక్షులే ఇన్-ఛార్జులు.

తల్లిపాల వారోత్సవాలు ప్రారంభం

బి.సి. సంక్షేమ హాస్టళ్ళలో 3, 4, 5 తరగతుల వారికి సీట్లు తగ్గించి 6 నుంచి 10వరకు చదివే విద్యార్థులకు సీట్ల సంఖ్యపెంపు.

2. హామీలు నెరవేర్చకుంటే ఉద్యమం : 20న డిమాండ్స్‌డే జె.ఎ.సి ప్రకటన.

నక్సల్స్ జాడకోసం హెలీకాప్టర్‌తో గాలింపు

రెండు సంవత్సరాల్లో నగరానికి కృష్ణా నీరు - ముఖ్యమంత్రి

3. సీమ, తెలంగాణాల్లో భారీవర్షాలు

పోలింగ్ ఉన్నతాధికారి జోక్యంతో పశ్చిమ గోదావరి జిల్లాలో పనికి ఆహారం బియ్యం హాంఫట్.

పోలీసు జి.డి.లోకి మంత్రిపేరు.

కరువు సహాయానికి రు. 48 కోట్లు విడుదల.

అసలు మీరు పనిచేస్తున్నారా? కన్సర్వేటర్లపై విరుచుకు పడ్డ అటవీశాఖ మంత్రి.

హైదరాబాద్‌లో వీధి దీపాలు, పారిశుధ్యం విభాగాలను ప్రయివేటీకరించడం వల్ల పనులు సక్రమంగా జరగటం లేదని కార్పొరేటర్ల ఆగ్రహం.

సింగరేణి కార్మికుల సమ్మె.

ప్రముఖ రచయిత ఎన్.ఆర్.నంది మరణం.

కరువుపై నివేదనకు ఢిల్లీకి మంత్రుల బృందం.

5. కర్నూలులో విద్యార్థులపై కలెక్టర్ స్వయంగా లాఠీ తిప్పిన వైనం.

కరువు ప్రాంతాల్లో విత్తన సబ్సిడీ. హెక్టారుకు రు. 625 లు.

సింగరేణి సమ్మె : 1వ రోజు నష్టం రూ. 13 కోట్లు.

6. మహబూబ్‌నగర్ జిల్లాలో పోలీసు కాల్పివేత. కరువు నీడలో కోళ్ళు, చేపల పరిశ్రమ విలవిల.

తక్షణమే రు. 4036 కో. రుణాలు - రాష్ట్ర స్థాయి బాంకర్ల కమిటీ నిర్ణయం

కరువుకు అదనపు సహాయం కావాలని రాష్ట్రమంత్రులు ప్రధానికి నివేదిక.

7. రాష్ట్రంలో 5 జిల్లాల్లో వాటర్‌షెడ్ అభివృద్ధి.

భీమవరంలో పనికి ఆహార పథకం మళ్ళింపు. నా ప్రమేయం లేదని మంత్రి సుబ్బారాయుడు ప్రకటన.

విశాఖలో వెయిట్ లిఫ్టింగ్ సెంటర్ ఫర్ ఎక్సలెన్స్ ఏర్పాటు -ముఖ్యమంత్రి వాగ్దానం.

8. కరువు తీరా వానలు - వ్యవసాయ పనులు.

వార్‌తో చర్చలు జరపండి. మాపీస్ ఇనీషియేటివ్ కమిటి.

10. సింగరేణి సమ్మె విరమణ

కరువు సహాయం కోసం కాంగ్రెస్ అధ్యక్షుడి నిరహార దీక్ష.

భీమవరం పనికి ఆహారం మళ్ళింపుపై విచారణ సి.ఎం.కు ఆదేశం.

11. రాష్ట్రంలో పారిశ్రామిక పెట్టుబడులకై రాష్ట్ర ముఖ్య మంత్రి మలేషియా పర్యటనలో వినతి.

టి.ఆర్.ఎస్. టి.ఎస్.ఎస్. విలీనం

విభేదాలు లేవు. ఎమ్మెస్, వై.ఎస్. సంయుక్త ప్రకటన.

నెల్లూరు జిల్లా జలదంకి లో మాతమ్మ ఊరేగింపుపై పోలీసు కాల్పులు - పలువురికి గాయాలు

12. చిత్తూరు జిల్లా సోమల మండలం నెల్లిమంద గ్రామం తిరునాళ్ళంలో విద్యుద్ఘాతానికి 8 మంది బలి.

13. పనికి ఆహారం పథకం - బియ్యం సరఫరాకై కేంద్రం నిరాకరణ.

కర్ణాటక ఎగువ తుంగపై ప్రాజెక్టు నిర్మిస్తున్నందుకు నిరసనగా సీమ రైతాంగం ఆందోళన.

అదిలాబాద్ జిల్లా లక్శ్మణ చాందా మండలంలో మరో ముగ్గురు చిన్నారులు విద్యుద్ఘాతానికి బలి.

| | 1950-51 | 1960-61 | 1970-71 | 1980-81 | 1990-91 | 1991-92 | 1993-94 | 1995-96 | 1997-98 | 1998-99 | 1999-2000 | 2000-01 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| **ECONOMIC INDICATORS** | | | | | | | | | | | | |
| GDP at factor cost | | | | | | | | | | | | |
| (i) At current prices (Rs. crore) | 9547 | 16220 | 42222 | 130178 | 510954 | 589086 | 781345 | 1073271 | 1390148 | 1598077 | 1755638P | 1895843Q |
| (ii) At constant prices (Rs. crore) | 140466 | 206103 | 296278 | 401128 | 692871 | 701863 | 781345 | 899563 | 1016399 | 1082472 | 1148500P | 1193922Q |
| Per capita net national product, at 1993-94 prices (Rupees) | 3687 | 4429 | 5002 | 5352 | 7321 | 7212 | 7690 | 8489 | 9242 | 9647 | 10067P | 10254Q |
| Index of industrial production[g] (Base:1993-94=100) | 7.9@ | 15.6 | 28.1 | 43.1 | 91.6 | 92.2 | 100.0 | 123.3 | 139.5 | 145.2 | 154.9 | 162.7P |
| Index of agricultural production (Base: triennium ending 1981-82) | 46.2 | 68.8 | 85.9 | 102.1 | 148.4 | 145.5 | 157.3 | 160.7 | 165.3 | 177.9 | 175.6 | 163.9 |
| Gross domestic capital formation (as per cent of GDP) | 8.7 | 14.4 | 15.4 | 20.3 | 26.3 | 22.6 | 23.1 | 26.9 | 24.6 | 22.7 | 24.3P | 24.0Q |
| Gross domestic savings (as per cent of GDP) | 8.9 | 11.6 | 14.6 | 18.9 | 23.1 | 22.0 | 22.5 | 25.1 | 23.1 | 21.7 | 23.2P | 23.4Q |
| **OUTPUT** | | | | | | | | | | | | |
| (a) Foodgrains (million tonnes) | 50.8 | 82.0 | 108.4 | 129.6 | 176.4 | 168.4 | 184.3 | 180.4 | 192.3 | 203.6 | 209.8 | 195.9 |
| (b) Finished Steel (million tonnes)$ | 1.0 | 2.4 | 4.6 | 6.8 | 13.5 | 14.3 | 15.2 | 21.4 | 23.4 | 23.8 | 27.2 | 29.3P |
| (c) Cement (million tonnes) | 2.7 | 8.0 | 14.3 | 18.6 | 48.8 | 51.7 | 57.8 | 69.5 | 82.1 | 88.0 | 100.1 | 99.5P |
| (d) Coal (including lignite) (million tonnes) | 32.3 | 55.2 | 76.3 | 119.0 | 225.5 | 243.8 | 264.1 | 292.3 | 319.0 | 315.7 | 322.1 | 332.6P |
| (e) Crude oil (million tonnes) | 0.3 | 0.5 | 6.8 | 10.5 | 33.0 | 30.4 | 27.0 | 35.2 | 33.9 | 32.7 | 31.9 | 32.4P |
| (f) Electricity generated (utilities only) (Billion KWH) | 5.1 | 16.9 | 55.8 | 110.8 | 264.3 | 287.0 | 324.0 | 379.9 | 421.7 | 448.5 | 480.7 | 499.5P |
| Wholesale price index* (Base:1993-94=100) | 6.8 | 7.9 | 14.3 | 36.8 | 73.7 | 83.9 | 100.0 | 121.6 | 132.8 | 140.7 | 145.3 | 155.7 |
| Consumer price index (Base:1982=100) @ @ | 17 | 21 | 38 | 81 | 193 | 219 | 258 | 313 | 366 | 414 | 428 | 444 |
| Plan outlay (Rs. crore) | 260## | 1117 | 2524 | 15023 | 58369 | 64751 | 88081 | 107380 | 129757 | 149404 | 167981 | 187931(RE) |
| Centre's budgetary deficit/ Draw down of Cash balance (Rs. crore) | (-)33## | (-)117 | 285 | 2576 | 11347 | 6855 | 10960 | 9807 | (-)910 | (-)209 | 864 | 2605(RE) |
| **FOREIGN TRADE** | | | | | | | | | | | | |
| (i) Exports | | | | | | | | | | | | |
| Rs. crore | 606 | 642 | 1535 | 6711 | 32553 | 44041 | 69751 | 106353 | 130100 | 139752 | 159561 | 203571 |
| US $ million | 1269 | 1346 | 2031 | 8486 | 18143 | 17865 | 22238 | 31797 | 35006 | 33218 | 36822 | 44560 |
| (ii) Imports | | | | | | | | | | | | |
| Rs. crore | 608 | 1122 | 1634 | 12549 | 43198 | 47851 | 73101 | 122678 | 154176 | 178332 | 215236 | 230873 |
| US $ million | 1273 | 2353 | 2162 | 15869 | 24075 | 19411 | 23306 | 36678 | 41484 | 42389 | 49671 | 50536 |
| Foreign exchange reserves (excluding gold and SDRs): | | | | | | | | | | | | |
| Rs. crore | 911 | 186 | 438 | 4822 | 4388 | 14578 | 47287 | 58446 | 102507 | 125412 | 152924 | 184482 |
| US $ million | 1914 | 390 | 584 | 5850 | 2236 | 5631 | 15068 | 17044 | 25975 | 29522 | 35058 | 39554 |
| **SOCIAL INDICATORS** | | | | | | | | | | | | |
| Population | | | | | | | | | | | | |
| Population (million)[a] | 361.1 | 439.2 | 548.2 | 683.3 | 843.4 | 856.8[b] | 892.1[b] | 928.0[b] | 964.4[b] | 982.7[b] | 1001.1[b] | 1027 |
| Birth rate (per 1000)[c] | 39.9 | 41.7 | 36.9 | 33.9 | 29.5 | 29.2 | 28.7 | 27.5 | 26.5 | 26.1P | .. | .. |
| Death rate (per 1000)[c] | 27.4 | 22.8 | 14.9 | 12.5 | 9.8 | 10.1 | 9.3 | 9.0 | 9.0 | 8.7P | .. | .. |
| Life expectancy at birth (in years)[d] | | | | | | | | | | | | |
| (a) Male | 32.5 | 41.9 | 46.4 | 50.9 | 58.6 | 59.0 | 60.4 | .. | .. | .. | .. | .. |
| (b) Female | 31.7 | 40.6 | 44.7 | 50.0 | 59.0 | 59.7 | 61.8 | .. | .. | .. | .. | .. |
| Total | 32.1 | 41.3 | 45.6 | 50.4 | 58.7 | 59.4 | 61.1 | .. | .. | .. | .. | .. |

# చిన్న పరిశ్రమలు బతికి బట్ట కట్టాలంటే....

వి. హనుమంతరావు

చిన్న పరిశ్రమల పరిరక్షణకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకుంటున్న విధాన నిర్ణయాలు కాగితాలకే పరిమితం అవుతున్నాయి అనే విమర్శ గత కొన్ని సంవత్సరాలుగా వినబడు తూనే ఉంది. యేఏడుకాయేడు మూతపడుతున్న చిన్న పరిశ్రమల సంఖ్యకూడా ఆ విమర్శ వాస్తవమేనని నిరూపిస్తోంది. ప్రభుత్వ నిర్ణయాలు సక్రమంగా అమలు కాని కారణంగా నిధుల సమీకరణ, మౌలిక సదుపాయాలు, మార్కెటింగ్ వంటి సమస్యలనే గత రెండు మూడు దశాబ్దాలుగా చిన్న పరిశ్రమలు ఎదుర్కొవలసి వస్తోంది.

## సంస్కరణల వెల్లువలో పారిశ్రామికాభివృద్ధి :

1991 లో నూతన ఆర్థిక విధానాలు, సరళీకృత విధానాల ప్రవేశంతో పారిశ్రామికాభివృద్ధిరేటు అంచనాలకు మించి పెరిగి పోతుందని ఆర్థిక, రాజకీయ నిపుణులు చెప్పినప్పటికీ అవి ఎంతవరకు ఫలితాలనిచ్చాయో చూస్తూనే వున్నాం. భారీ పరిశ్రమలే విదేశీ పోటీని తట్టుకోలేకపోతున్న ప్రస్తుత తరుణంలో చిన్న పరిశ్రమలు గుక్క తిప్పుకోలేక, బతికి బట్టకట్టలేక పోతున్నాయి. CII, RBI, చిన్న పరిశ్రమల సమాఖ్యలు నిర్వహించిన పలు సర్వేలు - పరిమిత సాంకేతిక పరిజ్ఞానం, మార్కెటింగ్ సమాచారం లోపం, సంస్థాగతరుణ కొరత, మంజూరీలో జాప్యం, విద్యుత్ కొరత, మౌలిక సదుపాయాలు లేకపోవడంవల్లే చిన్న పరిశ్రమలు మూత పడుతున్నాయని చెప్పున్నాయి. జాతీయ ఎగుమతుల్లో చిన్నపరిశ్రమల వాటా 34 శాతం. అంటే లక్షా 26వేల కోట్ల రూపాయలన్నమాట. స్థూల జాతీయోత్పత్తిలో SSI ల వాటా ఏడు శాతం. 1999-2000 సంవత్సరం నాటికి దేశవ్యాప్తంగా మొత్తం 32.25 లక్షల చిన్న పరిశ్రమలుండగా, వాటి ద్వారా కోటి 77 లక్షల మందికి ఉపాధి కలుగుతోందని ప్రభుత్వ గణాంకాలు చెబుతున్నాయి.

ఆర్థికాభివృద్ధిలో ప్రధానపాత్ర వహిస్తున్న చిన్న పరిశ్రమల పరిస్థితి మన రాష్ట్రంలో మరీ దారుణంగా వుంది. ఇతర రాష్ట్రాలలో భారీ, మధ్యతరహా పరిశ్రమలతోపాటు చిన్న పరిశ్రమల సంఖ్య పెరిగింది. కాని ఆంధ్రప్రదేశ్‌లో అందుకు భిన్నంగా 2002 నాటికి (ఈ సంవత్సరం లెక్కల ప్రకారం) మొత్తం యూనిట్లలో 13.25 శాతం యూనిట్లు మూతపడ్డాయి. కర్నుడి చావుకు కారణాలు అనేకం. ఇదీ అంతే. అన్ని రంగాల్లో తన ప్రతాపంచూపి, ఆర్థిక విధానాల రూపకల్పనలో కూడా వత్తిడి తెచ్చిన ప్రపంచ వాణిజ్య సంస్థ (WTO) నీలినీడలు చిన్న పరిశ్రమలపై కూడా పడ్డాయి. తిమింగలం బారిన పడ్డాక చిన్న చేపలు బతకగలవా? WTO వత్తిడి మేరకు సబ్సిడీలు తగ్గించడంతో పాటు, దిగుమతి ఆంక్షలను తొలగించి, దాదాపు 1500 రకాల వస్తువులపై పరిణా మాణాత్మక ఆంక్షలు తొలగించడంతో విదేశీ వస్తువులు కుప్పలు, తెప్పలుగా దేశంలోకి రావటం ప్రారంభించాయి. దాంతో చిన్న పరిశ్రమల వెన్ను విరిగింది. చైనాబజారుల వల్ల మెదక్ ప్రాంతంలో 300 పరిశ్రమలు మూత పడటాన్ని ఉదాహరణగా చెప్పొచ్చు. అలాగే నాణ్యతా ప్రమాణాల పేరుతో WTO విధించిన నిబంధనలమేరకు అంతర్జాతీయ పోటీని తట్టుకోలేని 300 చిన్న పేపర్‌మిల్లులు మూతపడ్డాయి. ఇక కొబ్బరిపీచు పరిశ్రమ నామరూపాలు లేకుండా పోయింది.

## పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం :

తిమింగలం పెద్ద చేపలను, పెద్ద చేపలు చిన్న చేపలను, చిన్న చేపలు చిట్టి చేపలను స్వాహా చేసినవిధంగా అంచెలవారీగా శక్తిని బట్టి ఎవరి పాత్రను వారు పోషిస్తున్నారు అంతర్జాతీయ వేదికపైన.

ప్రపంచ వాణిజ్య సంస్థ ఆంక్షలు ఒకపక్క కుంగతీస్తుంటే దేశీయ బడా పెట్టుబడిదారులు కూడా మేం మాత్రం తక్కువ తిన్నామా అంటూ, వారి వంతు పాత్ర వారూ పోషిస్తున్నారు. పెద్ద పరిశ్రమలే చిన్న చిన్న యూనిట్లను స్థాపించి, పలుకుబడితో, పైరవీలతో అరాకొరా అందుతున్న SSI రాయితీలను దేగల్లా తన్నుకుపోతున్నాయి. రక్షణ రంగంలోని విడి ఉత్పత్తులు అనేక సంవత్సరాలుగా చిన్న పరిశ్రమల రంగంలో తయారవుతున్నాయి. అయితే బడా పరిశ్రమల అధిపతుల కన్ను పడటంతో చిన్న పరిశ్రమల పేరుతో పలుకుబడితో, వత్తిడితో, రక్షణ రంగ ఆంక్షలను కూడా వారు కొల్లగొడుతున్నారు. ఇలా పెద్ద సంస్థల అవకాశాలను చిక్కించుకోవడంతో దేశవ్యాప్తంగా రక్షణరంగంలో 400 చిన్న పరిశ్రమలు సంకటంలో పడ్డాయి. అందులో 50 కంపెనీలు ఒక్క హైదరాబాద్‌లోనే వుండటం విశేషం.

## సైదోడుగా ప్రభుత్వం :

ప్రభుత్వ చర్యలు కూడా బడా పారిశ్రామిక వేత్తలకు అనుకూలంగా వున్నాయి. సిల్క్, ఖాదీ చేనేత, గ్రామీణ పరిశ్రమలు ఒక పక్క విలవిల్లాడుతుంటే కుటీర పరిశ్రమగా గుర్తింపుపొంది

ఇంటిల్లపాదికి ఉపాధి ఇచ్చే చేనేత రంగానికి చేయూత అందకనే ఆయా కార్మికులు ఆత్మహత్యలు చేసుకునే పరిస్థితి దాపురించింది. చేయూత పేరుతో బడా పారిశ్రామికవేత్తల ఉత్పత్తుల అమ్మకాలకీ పరిమితమైన అపెరెల్ పార్కులను నిర్మిస్తోంది. కాని, ఆత్మహత్యలను నివారించలేక పోతుంది. ఇండియా సిమెంట్స్‌కు ఇచ్చిన 200 కోట్ల రాయితీలతో 20 వేల చిన్న పరిశ్రమలను తిరిగి ట్రాక్‌లోకి తీసుకురావచ్చు ననే సత్యాన్ని ప్రభుత్వమే విస్మరించింది. ఇంతకన్నా దారుణాన్ని కనగలమా?

## 'అంతర్గత పోటీ'యే ఓ మరణశాసనం :

కోటి రూపాయల కన్నా తక్కువ పెట్టుబడితో నడిచే పరిశ్రమలు (చిట్టి పరిశ్రమలు) కోకొల్లలు. అసలు వీటిని పట్టించుకునే నాధుడే లేడు. లాభం వస్తేసరి, లేకపోతే వాటి అడ్రస్సే లేకపోవడం పరిపాటి అయింది. అందించే రాయితీలను చిన్న పరిశ్రమల్లో పెద్ద చేపలు హైజాక్ చేయడంతో చిట్టి పరిశ్రమలు సమస్యలనేకం ఎదుర్కోవలసి వస్తోంది. విదేశీ పోటీ పారిశ్రామిక రంగానికే మరణశాసనమైతే - భారీ మధ్య, చిన్న, చిట్టి పరిశ్రమలు పైన చెప్పుకున్న రీతిలో పోటీ పడుతూ, దేశీయ పరిశ్రమలు తమ మరణశాసనాన్ని తామే రాసుకుంటున్నాయి.

## పొంతన లేని నిబంధనలు - మౌలిక సదుపాయాలు :

మౌలిక సదుపాయాల విషయం చర్చించడమే అనవసరం అనిపిస్తుంది. రోడ్లులేని పారిశ్రామిక వాడలే మనకు దర్శన మిస్తాయి. రాష్ట్రంలోని 270 పారిశ్రామిక వాడలుండగా అందులో 10 మాత్రమే అంతంతమాత్రంగా వున్నాయి. కాప్రా మున్సిపాలిటీ లో వున్న నాలుగు పారిశ్రామిక వాడల్లో 1200 యూనిట్లు వుండగా అందులో 50 యూనిట్లు మౌలిక సదుపాయాల కొరత కారణంగా మూత పడ్డాయి. ఇక మార్కెటింగ్ సదుపాయాలు కల్పించడంకోసం ఏటా కోట్లాది నిధులు వెచ్చిస్తున్నా, పరిశ్రమల శాఖద్వారా కేవలం 17 రకాల ఉత్పత్తులకు మాత్రమే మార్కెటింగ్ లో సౌకర్యముందనే విషయం 'షాక్'ని తినిపిస్తుంది. కాని అది పచ్చి నిజం.

పరిశ్రమ స్థాపన, నిర్వహణకు అవసరమయ్యే కనీస నిధుల కోసం ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలు పడనిపాట్లు లేవు. బ్యాంక్ ఋణాల మంజూరీలో కొలేటరల్ పట్టణ ఆస్తులనే చూపాలనే నిబంధన ఏళ్ళతరబడి పరిశ్రమ స్థాపకులను ముందుకు రానీయడంలేదు. ఇక ఎగుమతుల విషయంలో బ్యాంక్ గ్యారంటీలను పొందాలంటే తాతలు దిగి రావల్సిందే.

అన్నింటికన్నా ముఖ్యంగా చెప్పుకోవలసింది విద్యుత్ సరఫరాలో అంతరాయం. పారిశ్రామిక వాడల్లో నిరంతరాయంగా కరెంట్ సరఫరా చేయకపోవడంవల్ల కరెంట్‌పోయిన ప్రతిసారీ పోయిన సమయంలో తయారయ్యే ఉత్పత్తిని నష్టపోతున్నాయి పరిశ్రమలు. ఏటా విద్యుత్ కొరతలో 13శాతం పరిశ్రమలు మూత పడుతున్నాయనే వాస్తవాన్ని ప్రభుత్వం దాచిపెడుతోంది. అంతేకాక యూనిట్ ఛార్జీని తగ్గించి, ఫిక్స్‌డ్ ఛార్జీలను పెంచాలనేది యజమానుల సూచన. దాన్ని వినే వారే లేరు. 1960 నుంచి 1980 మధ్య మన రాష్ట్రంలో చిన్న పరిశ్రమల వృద్ధిరేటు అధికంగానే వుంది. కాని 1993 నుంచి అది తిరోగమనంవైపు పరుగులు తీస్తోంది. దీనికి గల కారణాల ను తిరిగి వివరించుకోనక్కర్లేదనుకుంటా! వీటికి తోడు అధికారుల వేధింపులు, విధానాల అమలులో లేని నిబద్ధత, చీటికి మాటికి విద్యుత్ సరఫరా, మార్కెటింగ్, రుణాలమంజూరీ తదితర విషయాలలో చిన్న పరిశ్రమలను ఇబ్బంది పెట్టని శాఖలున్నాయా?

## మరేదీ "పరిష్కారం" ?

ప్రతీ సమస్యకు పరిష్కారమున్నట్లే ఈ సమస్యలకు పరిష్కార మార్గాలున్నాయి. కొత్తవేమీ కాదు. అనేక సర్వేలు అనేకమంది విశ్లేషకులు ఇచ్చిన సూచనలే ఇవి. ప్రపంచ వాణిజ్య సంస్థ వల్ల ఎక్కువగా నష్టపోతున్న పరిశ్రమ ఫుడ్ ప్రాసెసింగ్ 'సిడ్బీ' నివేదిక ప్రకారం ప్రతి 20 కార్యకలాపాలలో దెబ్బతినే ప్రతి 10 కార్యకలాపాలు ఫుడ్ ప్రాసెసిస్‌కు చెందినవేనని తెలుస్తోంది. ముఖ్యంగా ఇవి పరిశుభ్రతకు ఖర్చుపెట్టలేక పోతున్నాయి. పైగా వాణిజ్యశాఖ వాచ్‌లిస్ట్‌లో పెట్టిన 300 ఐటమ్స్‌లో 20 ఫుడ్ ప్రాసెసింగ్ చెందినవే. ఇంకా పేపర్ ఉత్పత్తులు, వెదురు, కేన్ ఫర్నీచర్, రబ్బర్ వస్తువులు పరిశ్రమ లకు కూడా ప్రపంచ వాణిజ్యసంస్థ పోటీని తట్టుకోవాలంటే ఈ పరిశ్రమలకు నిర్వహణా నిధులను, రుణాల రూపంలో అంద జేయవలసివుంది. నాణ్యతా ప్రమాణాలను నిర్దేశించి, తక్కువ వ్యయంతో నాణ్యతా పెరిగేలా, వాటికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రభుత్వం అందించాలి.

అన్నింటికి మించి CII సర్వే సూచనల మేరకు ISO సర్టిఫికెట్ పొందేలా చిన్న పరిశ్రమలకు అవగాహన పెంచి, లాభాలు పెరిగేలా ప్రభుత్వం కృషి చేయాలి. అలాగే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను చిన్న పరిశ్రమల రంగంలోకి అనుమతించ కూడదు. అంతకు మించి బ్యాంక్ గ్యారంటీలతో కూడిన ఎగుమతి సౌకర్యాలను కల్పించాలి. పైన చెప్పుకున్న అంశాల్లో కొన్నింటినైనా చిత్తశుద్ధితో అమలుచేస్తే, కొన్ని చిన్న పరిశ్రమలైన తిరిగి ఊపిరి పీల్చుకుంటాయి. ■

**రాష్ట్ర పరిశ్రమల్లో పెట్టుబడుల తీరు తెన్నులు**
**1991- అక్టోబర్ 2001**

| | మెగా ప్రాజెక్టులు | | రూ. 25-100 కోట్లు | |
|---|---|---|---|---|
| | సంఖ్య | పెట్టుబడి (కోట్లలో) | సంఖ్య | పెట్టుబడి (కోట్లలో) |
| ఉత్పత్తి ప్రారంభించినవి | 21 | 7278 | 98 | 4343 |
| నిర్మాణంలో ఉన్నవి | 34 | 50314 | 37 | 1713 |
| ప్రారంభదశలో వున్నవి | 20 | 38275 | 97 | 4888 |
| ఉపసంహరించుకున్నవి | 81 | 30458 | 96 | 4067 |
| మొత్తం | 156 | 126325 | 328 | 15011 |

# తలసరి ఆదాయం సూచించేదేమిటి?

- ఎన్. వేణుగోపాల్

సామాజికాభివృద్ధికి ఒక సూచికగా జాతీయాదాయం పెరుగుదలనో, తలసరి ఆదాయం పెరుగుదలనో చూపడం ఒక ఆనవాయితీ అయింది. మరీ ముఖ్యంగా గత దశాబ్దంగా 'అభివృద్ధి మాయాజాలాన్ని' ప్రచారం చేస్తున్న పాలకులు అంకెల గారడీతో ఆరు శాతం పెరుగుదల, పదిశాతం పెరుగుదల, పన్నెండు శాతం పెరుగుదల వంటి డాంబికాలు ప్రకటిస్తున్నారు.

ఒకవైపు జాతీయాదాయం, తలసరి ఆదాయం, వాటి పెరుగుదలరేట్లు పైపైకి ప్రయాణిస్తుండగా, మరోవైపు ప్రజల జీవన ప్రమాణాలు దిగజారుతుండడం, పేదరికం పెరిగిపోతూ ఉండడం నిత్యజీవిత వాస్తవికత అయింది. ఈ స్థితిలో మానవాభివృద్ధి అంటే నిజంగా ఏమిటి? కేవలం తలసరి ఆదాయం పెరుగుదలతో మానవాభివృద్ధిని కొలవవచ్చునా, మానవాభివృద్ధిని లెక్కించ డానికి పరిశీలించవలసిన ఇతర ప్రమాణాలేమిటి అనే చర్చ అభివృద్ధి అర్థశాస్త్రంలో ప్రధానమైన చర్చ అయ్యింది.

తలసరి ఆదాయాన్ని ఒక సమాజపు అభివృద్ధికి చిహ్నంగా చూడడంలో ప్రధానంగా మూడు సమస్యలున్నాయి. ఒకటి, ఆ తలసరి ఆదాయపు అంకె దేశం మొత్తానికో, రాష్ట్రం మొత్తానికో సగటు అంకె కావడం వల్ల ఆ జనాభాలోని అంతరాల గురించి ఆ అంకె చెప్పజాలదు సరిగదా తప్పుడు సూచికలను కూడా ఇస్తుంది. ఉదాహరణకు మన దేశంలోనూ రాష్ట్రంలోనూ రోజుకు పది రూపాయల ఆదాయం రావడాన్నే మహాభాగ్యంగా భావించే వాళ్ళు కోట్లాది మంది ఉన్నారు. మరొక కొసన రోజుకు కొన్ని డజన్ల కోట్ల రూపాయలో, వందల కోట్ల రూపాయలో ఆదాయం వచ్చేవాళ్ళు కూడా కనీసం కొన్ని వందల మంది అయినా ఉన్నారు. వారినీ వీరినీ కలగలిపి, వారిరువురి ఆదాయాలను కలిపేసి, మొత్తం జనాభాతో భాగహారం చేస్తే వచ్చే అంకె ఎంత హాస్యాస్పదమైనదో చెప్పనక్కరలేదు కాని దశాబ్దాలుగా ఇటువంటి అంకెలూ తయారవుతున్నాయి. ప్రభుత్వాలు ఆ అంకెలనే పట్టుకుని తమ అభివృద్ధిని ప్రకటించుకుంటున్నాయి.

రెండో సమస్య, తలసరి ఆదాయం అనే అంకె ఉజ్జాయింపుగా సరైన ఆదాయాలనే ప్రతిబింబించే చోట కూడా దాని లక్షణం పరిమాణాత్మకమైనదే గాని గుణాత్మకమైనది కాజాలదు. అంటే వచ్చే ఆదాయం సామాజిక శ్రేయోదాయకమైన కార్యక్రమాలనుంచి వస్తుందా, అందుకు భిన్నంగా సామాజిక ఆరోగ్యాన్ని భంగపరిచే కార్యక్రమాల నుంచి వస్తుందా అనే దానితో తలసరి ఆదాయం అంకెకు నిమిత్తం లేదు. అట్లాగే ఆ తలసరి ఆదాయం మానవాభివృద్ధికోసం వినియోగించ బడి, మనుషుల జీవన ప్రమాణాలు పెరుగుతున్నాయా, లేక అనుత్పాదక, అనవసర, వ్యర్థ రంగాలలో వినియోగించబడుతూ మనుషుల జీవన ప్రమాణాల మీద ఎటువంటి ప్రభావం చూపడం లేదా అనే ప్రశ్నతో ఆ అంకెకు నిమిత్తం లేదు.

మూడో సమస్య, తమ ప్రజల వర్తమానాన్నీ, భవిష్యత్తు నూ తీర్చిదిద్దవలసిన ప్రభుత్వాలు, ప్రజల కనీస అవసరాలను తీర్చడం మాత్రమే గాక విజ్ఞాన, వినోద అవసరాలను తీర్చవలసిన ప్రభుత్వాలు ఆ పని నుంచి తప్పుకునేందుకు, ఆ పనిని విస్మరింపజేసేందుకు తలసరి ఆదాయంలో పెరుగుదల అంకెలను ఒక ముసుగుగా వాడుకుంటు న్నాయి. పిడికెడు మంది సంపన్నుల ఆస్తులను ఇంకా పెంచడంద్వారా, పనిచేసే చేతులకు ఉపాధి కల్పించకపోయినా ఎక్కువ పెట్టుబడులను, ఎక్కువ సాంకేతిక విజ్ఞానాన్ని, ఎక్కువ లాభాలను ప్రవేశపెట్టడం ద్వారా జాతీయాదాయం అంకెలను ఇతోధికంగా పెంచడానికి ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి. ఆ రకంగా పెరిగిన జాతీయా ఆదాయాన్ని జనాభాతో భాగించి తలసరి ఆదాయం పెరిగిందని ప్రగల్భాలు పలుకుతున్నాయి. అందువల్లనే తలసరి ఆదాయం లో పెరుగుదల కనబడుతున్నప్పటికీ పేదరికం పెరగడం, సంపద కొందరి చేతుల్లో పెరుగుతుండడం, అంతరాలు పెరుగు తుండడం జరుగుతున్నాయి.

ఈ నేపథ్యంలో మానవ అభివృద్ధికీ, సంక్షేమానికీ సూచికగా కేవలం తలసరి ఆదాయం అంకెను తీసుకోగూడదని, మరింత విశాలమైన నిర్వచనంతో, మరిన్ని ప్రమాణాలను నెలకొల్పాలనీ ఆలోచన ప్రారంభమైంది. ఐక్యరాజ్యసమితి అభివృద్ధి పథకం (యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం) గత పది సంవత్సరాలకు పైగా మానవ సంక్షేమాన్ని కొలవడానికి కొత్త ప్రమాణాలను తయారు చేస్తూ వస్తోంది. పాకిస్తాన్‌కు చెందిన అభివృద్ధి అర్థశాస్త్రవేత్త మహబూబుల్ హక్,

యుఎన్‌డిపి సంయుక్తంగా 1989 నుంచి మానవాభివృద్ధి నివేదిక అనే ఒక కొత్త దృక్పథానికి సంబంధించిన ఆలోచనలను ప్రకటిస్తున్నారు.

మానవాభివృద్ధి అంటే ప్రజల ముందు ఉండే ఎంపిక అవకాశాలను విస్తృతం చేసే ప్రక్రియ అని, సంక్షేమాన్ని ఇతోధికంగా ఉన్నత స్థాయికి తీసుకుపోయే ప్రక్రియ అని మానవాభివృద్ధి నివేదిక నిర్వచించింది. ఎంపిక అవకాశాలనేవి స్థలకాలాలను బట్టి మారవచ్చునని, వేరువేరుగా ఉండవచ్చునని కూడా మానవాభివృద్ధి నివేదిక అంగీకరించింది.

స్థూలంగా ఇప్పటివరకు మానవాభివృద్ధి నివేదికలో వ్యక్తమయిన ఆలోచనల ప్రకారం ఎంపిక అవకాశాలంటే, సుదీర్ఘకాలం, ఆరోగ్యంగా జీవించగలిగే అవకాశం కావచ్చు. జ్ఞానాన్నీ, విద్యనూ పొందగలిగే అవకాశం కావచ్చు. గౌరవ ప్రదమైన జీవనం గడపడానికి అవసరమైన వనరులను పొందగలిగే అవకాశం కావచ్చు. ప్రధానంగా ఈ మూడు మార్గాలను గుర్తించిన మానవాభివృద్ధి నివేదికలు ఆయు: ప్రమాణం, అక్షరాస్యత, స్త్రీ పురుషసమానత్వం, సర్వతోముఖాభి వృద్ధి వంటి ఎన్నో అంశాలను పరిగణనలోకి తీసుకున్నాయి. తలసరి ఆదాయం కూడా ఒకానొక సూచిక కావచ్చునని అంగీక రించాయి.

ఆయుఃప్రమాణం, విద్యార్హతలు అనేవి వాటికవిగానే లక్ష్యాలుగా ఉంటాయని, ఒక మనిషి జీవన ప్రమాణానికి గుణాత్మక సూచికలుగా పనిచేస్తాయని యుఎన్‌డిపి అంటుంది. తలసరి ఆదాయం అనే సూచిక ఎంత లోపభరితమయిన దయినా, దాన్ని సాధించవలసిన ఇతర ప్రమాణాలకు సాధనంగా చూసినప్పుడు అంగీకరించవచ్చునని ఆ నివేదిక అంటుంది.

అంటే కొత్త దృక్పథం ప్రకారం మానవాభివృద్ధికీ, సంక్షే మానికీ ఆయుఃప్రమాణం, విద్య, ఆరోగ్యం, స్త్రీ పురుష సమానత్వం, వనరులపై అధికారం వంటి లక్ష్యాలూ, తలసరి ఆదాయం వంటి సాధనాలూ ప్రమాణాలుగా ఉంటాయి.

సరిగ్గా ప్రపంచవ్యాప్తంగా ప్రపంచీకరణ క్రమం ఉధృతం కావడం, మన దేశంలో ప్రపంచీకరణలో భాగంగా నూతన ఆర్థిక విధానాలు అమలుకావడం, పెట్టుబడిదారీ సాంఘిక ధర్మం మినహా, 'గత్యంతరం లేదు' అని మార్గరెట్ థాచర్ సిద్ధాంత ప్రవచనం చేయడం, మానవాభివృద్ధి గురించి కొత్త దృక్పథం ఉనికిలోకి రావడం ఒకే నేపథ్యం నుంచి వెలువడడం గమనించ దగిన విషయం. యుఎన్‌డిపి మొదటి నుంచీ పెట్టుబడిదారీ ప్రపంచీకరణ శక్తులు ప్రకటించే అభివృద్ధికి భిన్నమైన వాదనలు చేస్తూ వస్తోంది.

మానవాభివృద్ధి నివేదిక 1999 ప్రధాన సంకలనకర్త డా॥ రిచర్డ్ జాలీ మాటల్లో చెప్పాలంటే, "మానవ జీవితమంటే ఆదాయం ఒక్కటే కాదు. మానవాభివృద్ధి అనే భావన ఆదాయం కన్న లోతయినది. విలువైనది. ఆదాయం మానవాభివృద్ధికి ఒక మార్గం మాత్రమే గాని గమ్యం కాదు.

అయినా ఇప్పటికీ మన ప్రభుత్వాలు తలసరి ఆదాయాన్నే ప్రధాన సూచికగా తీసుకుని మనం ఇంకా ఇంకా పైపైకి వెళ్ళాలని ఉద్బోధిస్తున్నాయి. నిజానికి యుఎన్‌డిపి మానవాభివృద్ధి నివేదిక సోదాహరణంగా తలసరి ఆదాయం హెచ్చుగా ఉన్నంత మాత్రాన అభివృద్ధి ఎక్కువగా ఉన్నదని చెప్పడానికి వీల్లేదని ప్రకటించింది. తలసరి ఆదాయం ఖతర్‌లో 20,987 డాలర్లు ఉన్నప్పటికీ, మానవ సంక్షేమ విషయంలో ఖతర్ ప్రజలు 7,910 డాలర్ల సగటు తలసరి ఆదాయం ఉన్న స్లొవాకియా ప్రజలతో సమానంగా ఉన్నారని మానవాభివృద్ధి నివేదిక చూపింది.

తలసరి ఆదాయం అనేది ప్రధానంగా ద్రవ్యరూపపు కొలత. అంటే మార్కెట్ ప్రక్రియలో భాగమై, ద్రవ్యరూపంలోకి మారగల అవసరాలను, అవకాశాలను మాత్రమే అది పరిగణన లోకి తీసుకుంటుంది. "ప్రపంచీకరణ, కొత్త సూత్రాలు, వాటిని రాస్తున్న స్వార్థపర శక్తులు, అంతర్జాతీయ మార్కెట్లను ఏకం చేయడం మీద శ్రద్ధ చూపుతారు. మార్కెట్ల ద్వారా తీరడానికి వీలులేని అవసరాలు కూడా ప్రజలకు ఉంటాయని వాళ్ళు గుర్తించరు. కనుక వాటిని నిర్లక్ష్యం చేస్తారు. ఈ క్రమం వల్ల అధికారం, సంపద కొన్ని దేశాల దగ్గర, కొంతమంది దగ్గర, కేంద్రీకృతమై, అశేష ప్రజానీకం పక్కకు తప్పుకోవలసి వస్తుంది అని యుఎన్‌డిపి రాసింది.

ఈ కొత్త దృక్పథం మన దేశంలోనూ కొందరు మేధావుల ను ఆకర్షించింది. ప్రభుత్వ గణాంకాలలో కూడా ఎంతో కొంత ఈ దృక్పథాన్ని జొప్పించడానికి కొంతకాలంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇప్పటికే కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తమ తమ రాష్ట్రాల మానవాభివృద్ధి నివేదికలను ప్రకటించాయి. ఆ ప్రయత్నాలన్నింటినీ ఇంకా సమగ్రం చేస్తూ కేంద్ర ప్రణాళికా సంఘం 2002 మార్చిలో భారతదేశపు జాతీయ మానవాభివృద్ధి నివేదిక 2001 ని మొదటిసారిగా ప్రచురించింది.

ఈ తాజా నివేదిక దాదాపు 70 వేర్వేరు ప్రమాణాల ఆధారంగా గణాంకాలను సేకరించి చాలా సమగ్రమైన విశ్లేషణలు చేసి, అంచనాలు ప్రకటించింది. ఎంతో కాలంగా కేవలం తలసరి దాయం మీద ఆధారపడి అభివృద్ధి మాయా జాలాన్ని ప్రచారం చేస్తున్న మనదేశంలో ఈ మానవాభి వృద్ధి నివేదిక కొత్త అంచనాలను అందిస్తోంది. ■

# రెక్కతొడిగిన శాంతి

-ఎస్. సుధాకర్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి సి.పి.ఐ.ఎం.ఎల్. పీపుల్స్‌వార్‌కు మధ్య చర్యలు మొదలయ్యాయి. రాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణాలో శాంతి సాధన దిశగా గత నాలుగైదేళ్ళుగా పౌర స్పందన వేదిక చేసిన ప్రయత్నాలు ఓ కొలిక్కి వచ్చి, యిరు పక్షాలూ చర్చలకు సిద్ధమయ్యాయి. సమాజంలో హింస, పీడన తొలగి ఒక అర్థవంతమైన శాంతి నెలకొనాలనే చిరకాలవాంఛ ఈనాటికి కార్యరూపం దాల్చింది.

ఈ చర్చల్లో ఇరుపక్షాలూ ఓపిగ్గా కొన్ని మౌలిక అంశాలమీద నిర్ణయాలకి రావలసివున్నా, వాస్తవానికి ఈ చర్చలు కేవలం ప్రభుత్వానికి, పీపుల్స్‌వార్‌కు సంబంధించిన అంశం మాత్రమే కాదు. సమాజంలో నిజమైన శాంతి సాధించాలంటే నిన్నటిదాకా అపరిష్కృతంగా మిగిలిపోయిన సమస్యలన్నింటికీ పరిష్కారమార్గాలు వెదకాలి. నిజానికి ప్రజల మౌలిక సమస్యల నుండి, సామాజిక సంక్షోభాలనుండి అసంతృప్తి, ఆరాటం, తిరుగు బాటు ముందుకు వస్తాయి. ఆకలి అణచివేతలనుండే ప్రజా నిరసన తీవ్రరూపం తీసుకుంటుంది. ఈ మౌలిక సమస్యలను పరిష్కరించినపుడే నిజమైన శాంతి భద్రతలు సాధ్యమౌతాయి. అందువల్ల ఈ చర్చల్లో అశేష ప్రజానీకం నిత్యం ఎదుర్కొంటున్న సమస్యలకు చోటువుండాలి. వాళ్ళ ఆకాంక్షలకు, అవసరాలకు స్థానం వుండాలి. ప్రజా సమస్యల పరిష్కారమే అటు ప్రభుత్వానికైనా, ఇటు ప్రజా ఉద్యమాలకైనా ఏకైక 'ఎజెండా' కావాలి.

ఆ దిశగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడం, ప్రజల ఆకాంక్షలను వెలుగులోకి తేవడం లక్ష్యంగా పీస్ ఇనిషియేటివ్ కమిటీ ఏర్పడింది. ఈ కమిటీ ఆధ్వర్యంలో వివిధ రాజకీయ పార్టీలతో, ప్రజా సంఘాలతో, మేధావులతో, రచయితలతో మే 28 న సభ జరిగేనాటికే, సిద్ధంగావున్న చర్చల ప్రక్రియ ఆ తర్వాత వేగవంతమయింది. చర్చల విధి విధాన నిర్ణయంలో తేల్చుకోవల్సిన అనేక అంశాలు ముందుకొచ్చాయి. యిది యిలా జరుగుతూ వుండగానే....మరోవైపు గుంటూరు, కరీంనగర్, అనంతపూర్, విజయవాడ నక్సలైట్ కార్యకర్తలను, రౌడీషీటర్లను ఎన్‌కౌంటర్ పేరిట పోలీసుల కాల్చివేత, మహబూబ్‌నగర్ జిల్లా ఐనవోలు సంఘటన చర్చల క్రమాన్ని దెబ్బతీసే చర్యలే. చర్చల కనువైన వాతావరణం కల్పిస్తామని, ప్రస్తుతం అలాంటి వాతావరణమే ఉన్నదని చెప్తున్న ప్రభుత్వం ఈ ఎన్‌కౌంటర్లు జరగకుండా జాగ్రత్త తీసుకోవల్సి వుంది. ఈ ధోరణి చర్చలపట్ల అవతలి పక్షాన్నే కాక ప్రజలను కూడా అనుమానాలకు, అపనమ్మ కాలకు గురిచేస్తుంది. పౌరస్పందన వేదిక సూచించిన అంశాలకు యిరుపక్షాలూ, కట్టుబడి వుండాలి. ప్రభుత్వం సైతం కాల్పుల విరమణ ప్రకటించడం, ఆ మేరకు పోలీసులను ఆదేశించడం అవసరం. అప్పుడే ఈ ఎన్‌కౌంటర్లు వేధింపులూ ఆగుతాయి. చర్చలకు అనువైన వాతావరణం అంటే 'యిదే' అవుతుంది.

దీనితోపాటు విధి విధానాల రూపకల్పనలో పీపుల్స్‌వార్ మీద తాత్కాలిక నిషేధం ఎత్తివేత, నక్సలైట్ నాయకుల తలలకు ఖరీదుల ఎత్తివేత మొదలైన అంశాలకు ప్రభుత్వం సానుకూలం గా స్పందించాల్సింది. అప్పుడే యిరుపక్షాలూ నేరుగా సామరస్య పూరితంగా చర్చించుకునే వీలుంటుంది. అంతేకాని శాంతి సాధన దిశగా మొదలైన చర్చల విధివిధాన దశలోనే నక్సలైట్ల ఆయుధా లకు సంబంధించిన నిబంధనపెట్టి చర్చలకు అవరోధం కల్పించడం భావ్యం కాదు. ఈ అంశం నేరుగా చర్చల్లోనే చర్చించుకోవడం మంచిది. నిజానికి రాష్ట్రంలో అర్థవంతమైన శాంతి నెలకొల్పడానికి పీపుల్స్‌వార్ ఆయుధాలే ఆటంకం కాదు. ప్రజా సమస్యలకు శాశ్వతంగా ఓ రాజకీయ పరిష్కారం సాధించేందుకు ప్రభుత్వం పూనుకోవడమే తక్షణ అవసరం. ఈ సమస్యలే అనేకరూపాల్లో అశాంతికి హింసకు కారణమవు తున్నాయి. ప్రభుత్వం శాంతి సాధనకు సమాయత్తమౌతుందంటే, ఆయా సమస్యలపై ఏ వైఖరి ప్రదర్శిస్తుందన్నదే గీటురాయి. అంతేకానీ, పీపుల్స్‌వార్ ఆయుధాలను పక్కనపెడితేనే 'నిషేధం' ఎత్తివేత అనీ, అప్పుడే చర్చలనీ ప్రభుత్వం అంటుందంటే, బహుశా పాలకులకు చర్చలసందర్భం అవసరం, అర్థం, కానట్టే లెక్క. ఒక ఉద్యమం ఆయుధాలు పట్టుకోవడానికి దారితీసిన పరిస్థితిని మార్చివేస్తేనే పౌరజీవితంలో ఆయుధాలకు శాశ్వత పరిష్కారం దొరుకుతుంది.

చర్చల విధి విధానాల దగ్గరే పట్టింపులకు పోకుండా, చర్చలకు అవసరమైన వాతావరణాన్ని పూర్తిస్థాయిలో కల్పించి అంతిమంగా ఏయే ప్రజాసమస్యలకు ఎంత అర్థవంతమైన పరిష్కారాలనూ, ఎంత రాజకీయ శాశ్వత పరిష్కారాలనూ సాధిస్తారనేదే ముఖ్యం. ఈ దిశగా యిరుపక్షాలూ బాధ్యతా యుతంగా కృషి చేయాల్సి వుంటుంది. ■

# మరో 'తాటాకు మంట!'

"దేవరవారికి జయము. తమ దర్శనార్థమై అభాగ్య నగరము నుండి ఇద్దరు ఆగంతకులు వచ్చియున్నారు".

"రమ్మను"

భటుడు వెళ్ళి ఇద్దరు వ్యక్తులను లోపలికి పంపించేడు.

ఆ ఇద్దరూ వచ్చీరావడంతోనే నేతాజీని పట్టుకుని కాళ్ళమీద పడి ఉక్కిరి బిక్కిరి చేశారు.

"ఆర్యపుత్రా. సాష్టాంగ ప్రణామములు. మమ్మల్ని 'అభీష్ట సిద్ధిరస్తు' అని ఆశీర్వదిస్తేగాని మీ కాళ్ళు వొదలం. అలా ఆశీర్వదించకపోతే కాళ్ళు పట్టుకు లాగేసి కిందపారేస్తాం. తస్మాత్ జాగ్రత్త. కావున మమ్మల్ని కరుణించవలె" అంటూ వాళ్ళిద్దరూ నేతాజీ ముందు సాగిలపడ్డారు.

"మీదుంపతెగ. లేవండ్రా"

"ఎదుటనుండి కదలము. పాదము లింక వదలము" అంటూ ఎలుగురాసిన గొంతుకలతో యుగళగానం మొదలు పెట్టేరు వాళ్ళిద్దరూ ఘోరంగా. నేతాజీ కాస్త జడుసుకున్నాడు.

"సరే. లేవండ్రా. అభీష్టసిద్ధిరస్తు. ఇంతకీ ఎవర్రా మీరు? అభాగ్యనగరంనించి ఇంద్రప్రస్థం దాకా ఎందుకొచ్చేరు?"

"ఆర్యపుత్రా. అన్యాయము. అన్యాయము. మేమే గుర్తు లేమా? కడచిన ఎన్నికలయందు తమ జయమునుకోరి క్వింటాల్ బస్తాకన్న బరువున్న పార్టీ జెండాను భుజాన మోసి మోసి ఇంటింటికి తిరిగి తిరిగి మారక్తమును చెమటగా చిందించి తమకు దిగ్విజయమును చేకూర్చిపెట్టిన కార్యకర్తలమోయీ మేము. ప్రస్తుతము ఉడుతాభక్తిగా అభాగ్యనగరములో పైరవీలు, కబ్జాలు, దందాలు చేసికొని సామాన్య జీవనము గడుపుచున్నాము. నేడు మీ కటాక్షము కొరకు మోర్నింగు ఫ్లయిటులో ఇంద్రప్రస్థమునకు విచ్చేసితిమి."

"ఎందుకొచ్చేరో చెప్పి చావండి".

"చెప్పెయ్యమంటారా? చెప్పింతర్వాత కాదంటే కుదరదు మరి. మళ్ళీ కాళ్ళు పట్టుకోడవే కాదు. ఈసారి కాళ్ళు నిజంగా లాగి అచ్చంగా కిందపాడేసి తీరతాం. మీ తల పగిలినా పగలొచ్చు. అన్యాథా భావించొద్దు మరి".

"ముందు చెబుతారా బైటిగ్గెంటించమంటారా?" అని నేతాజీ గర్జించగానే -

"కరుణను జూపవయా - నేతా

పెట్రోల్ పంపునొసంగవయా - నేతా"

అంటూ భజన మొదలెట్టేరు వాళ్ళిద్దరూ.

"మీ మొహాలకీ పెట్రోల్ పంపులు కావాల్రా?" అంటూ ఆగ్రహం చూపేడు నేతాజీ.

"మరీ ఫ్రీగా అడగట్లేదు ఆర్యపుత్రా. మీ కష్టం వుంచుకోంలే. తలో లక్ష దీనారాలూ తెచ్చేం.

అంటూ చెరోమూటా అందించబోయేరు.

"నాకులంచవిస్తారా? ఏవనుకున్నార్రా నన్ను గురించి? ఈ రేడు భువనములయందు నన్ను మించిన నిజాయితీ పరుడు లేడని ఆస్థాన గాయకులు గానము సేయుట వినలేదా? ఆస్థాన పత్రికలు ప్రత్యేక వ్యాసములు వ్రాయుట కనలేదా?"

"అమ్మమ్మ. ఎంతమాట? తమ పట్ల అభినందన పూర్వకంగానున్నూ, మన పార్టీ అభివృద్ధి కోరుకుంటూనున్నూ మేము తెచ్చిన 'పవిత్రకానుక'ను "లంచం" అని మమ్మల్ని అవమాని స్తారా? కార్యకర్తల్ని అవమానించిన ఏ నేతా బతికి గోచీ కట్టలేదు. ఇది చరిత్ర చెప్పిన తిరుగులేని సత్యం. కాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకు మాటాడండి".

"సరే సరే. ఇంతకీ మాకు చెరో పెట్రోల్ పంపూ ఎలాట్ చేయించమంటారు. అంతేగా? తప్పకుండా చేయిస్తా. కాని లక్ష దీనారాలు చాలా తక్కువయ్యా. మరో లక్ష చొప్పున పట్టుకు రండి. అంతే నేనే తినేస్తాననుకునేరు. పైపై లెవెల్స్‌లో పంపకాలు చెయ్యాలి మరి.

"మరో లక్ష ఎక్కణ్ణించి తేవాలి ఆర్యపుత్రా?"

"ఒద్దంటే చెప్పండి. చాలా మంది క్యూలో వున్నారు. మీరు సాయంత్రం ఫ్లైట్‌లో వెళ్ళి మళ్ళీ రాత్రి ఫ్లైట్‌కి డబ్బు తెస్తేనే మీకు పెట్రోల్‌పంపులొస్తాయి. తేపోతే వేరేవాళ్ళు క్యూలో డబ్బు పట్టుకు రెడీగా వున్నారు."

దాంతో వాళ్ళిద్దరూ వెంటనే వెళ్ళి చెరోలక్ష దీనారాలూ తెచ్చి యిచ్చేరు. నేతాజీ మొత్తం నాలుగు లక్షలూ మూటగట్టు కున్నాడు. అలా ఎన్ని కోట్లదినారాలో! ఎంతమంది నుంచో!!

ఇది జరిగిన నాలుగు రోజులకే పెట్రోలు పంపుల పంపకాలన్నీ కొన్ని రాజకీయపరమైన ఈర్ష్యల కారణంగా రద్దు కాక తప్పలేదు.

"నా డబ్బులు నాకిచ్చెయ్యి" అంటూ వాళ్ళిద్దరూ నేతాజీ ని నిలదీశారు. "ఏ డబ్బులు? ఎవర్రామీరు?" అని నేతాజీ దబాయించబోయాడు.

"ఆర్యపుత్రా. పెట్రోలు ఒంటిమీద పోసుకుని అగ్గిపుల్లె సుకుని నిన్ను తనివిదీర కౌగలించుకొనెదము. కాచుకొమ్ము" అని పెట్రోలు డబ్బాలు తీశారు వాళ్ళిద్దరూ.

అప్పుడు నేతాజీ వారిని వారించి, లౌక్యంగా నవ్వి ఇలా ఉపదేశించేడు.

"ఒరేయ్. భయపడకండ్రా! రాజకీయాల్లో ఇట్లాంటి దుమారాలు నిజానికి తాటాకుమంటలే. గతంలో ఇట్లాంటివెన్ని చూళ్ళేదు గనక? గాభరా అవకండి. కాస్త ఓపిక పట్టండి. పెద్ద కోర్టునించి స్టే తెచ్చుకుని మన అక్రమాలు కొనసాగిద్దాం. ఈ లోపులో ఎవడేనా ప్రతిపక్షి గొడవచేశాడనుకో. క్రీస్తు పూర్వం మొహంజొదారో - హరప్పా నాగరికత కాలం నాటినుంచీ ఎలాట్ చేసినట్టి పెట్రోలు పంపుల భాగోతాల చిట్టా బైటికి తియ్యమని చెప్పి ఓ మహా మెలిక పెడదాం. దాంతో ఈ గొడవ చేస్తున్న ప్రతిపక్షులంతా చచ్చూరుకుంటారు."

"ఆర్యపుత్రా. నీ బుర్రే బుర్ర" అంటూ ఆనందంగా అభినందించి వెళ్ళేరు ఆకార్యకర్తలిద్దరూ.

- సత్యకామ్

# ప్రజాస్వామ్య విలువలనూ, మానవ హక్కులనూ తుడిచి పెట్టేస్తున్న ఐఎంఎఫ్, ప్రపంచ బాంకు

- విద్యాభూషణ్

ప్రపంచంలోని అనేక వర్ధమాన దేశాల్లో ఓ పద్ధతి ప్రకారం ప్రజాస్వామ్య విలువలను, మానవ హక్కులను అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ బ్యాంకు తుడిచి పెట్టేస్తున్న వైనం కన్పిస్తూ వుంది.

దేశప్రజల ప్రయోజనాలను, దేశాధినేతల స్వప్రయోజనాల కు బలిపెడుతూ వారిని జవాబుదారీ తనం నుండి దూరం చేసేస్తూ ప్రజాస్వామిక విలువలనే కలుషితం చేసేస్తున్నాయి ఈ రెండు సంస్థలు. ప్రజల సాంఘికావసరాలను ద్రవ్యనిధి సంస్థలకు తాకట్టు పెడ్తూ, ఆరోగ్యం, విద్య వంటి మౌలికావ సరాలనుండి దూరం చేసేస్తూ ప్రపంచ ప్రకటిత మానవ హక్కులనేవి లేకుండా చేస్తున్నాయి. పారిశ్రామి కాభివృద్ధి పేరిట పేదప్రజల కనీసావసరాలను ఉపేక్షిస్తున్నాయి. అంతర్జాతీయ రుణదాతలుగా 60 దేశాల ఆర్థిక వ్యవస్థలపై పెత్తనాన్ని చెలాయి స్తున్నాయి. రుణాన్ని పొందేందుకు తాము పెట్టే షరతులకు లొంగేలా చేస్తున్నాయి. స్వేచ్ఛా వాణిజ్య ప్రోత్సాహం, మార్కెట్ సరళీకరణ, ఆర్థిక స్థిరీకరణ వంటి నినాదాల మాటున పేద ప్రజల విద్య, వైద్యం, సాంఘిక సేవల కేటాయింపులను కుదింప చేస్తూ అసమానతలను అధికంచేస్తూ పేదరికాన్ని పండిస్తున్నాయి.

1948లో ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ఆమోదించిన సార్వత్రిక మానవహక్కుల పత్రం మాత్రం, వ్యక్తి స్వతస్సిద్ధ ఔన్నత్యం, స్వేచ్ఛా సమానత్వపు హక్కులు హరించ లేనివి. ఈ అంతర్జాతీయ మానవ హక్కుల పత్రం అణచివేతకు వ్యతిరేకంగా భావ ప్రకటనా స్వేచ్ఛ, సంఘనిర్మాణ హక్కులను పటిష్టం చేస్తూ రాజకీయ, పౌరహక్కులకు రక్షణను కల్పిస్తుంది. యిదే క్రమంలో వ్యక్తి అంతరాత్మ స్వేచ్ఛకు మానవ ఔన్నత్యానికి ఆర్థిక భద్రతే కేంద్రంగా నిలుస్తుందనికూడా ఈ పత్రం నిస్సందేహంగా స్పష్టం చేస్తుంది.

ఉదాహరణకు ఈ మానవ హక్కుల పత్రంలో పనిచేసు కునే హక్కును, పనికి అనువైన పరిస్థితులనాశించే హక్కును.. పని కల్పించమని అడిగే హక్కులను ప్రాథమిక మానవ హక్కులుగా రూపొందంచడం జరిగింది. అలాగే సమాన పనికి సమాన వేతనం, ఉచిత విద్యలను మానవ ఔన్నత్యానికై విశ్వ మానవ హక్కులుగా రూపొందించారు.

ప్రతివ్యక్తి తన జీవనస్థాయిని ఆరోగ్యం, ఆహారం, బట్టలు, యింటివసతి యితరత్రా సాంఘిక విలువలను కాపాడుకో గలిగే స్థాయిలో ఉండేలా, నిరుద్యోగం, అనారోగ్యం, అశక్తత, వైధవ్యం, వృద్ధాప్యం వంటి వాటినుండి రక్షణ పొందేలా ఈ మానవ హక్కుల పత్రం హామీనిస్తుంది.

ఈ పత్రం ఆర్థిక పరిపుష్టికి సంబంధించిన పలు విభాగాల్లో, మౌలిక మానవావసరాలు తీరిననాడే రాజకీయ హక్కులను వినియోగించుకోగలమని నిర్ధిష్టంగా స్పష్టం చేయడం జరిగింది.

ఆర్థిక భద్రతలేకుండా, వ్యక్తిగత స్వేచ్ఛ, వ్యక్తి ఔన్నత్యానికి తావేలేదంటూ, ఆర్టికల్ 22లో ప్రతీ మానవుడు సాంఘిక భద్రతను ఓ హక్కుగా కలిగివుండాలని చెప్పింది. ఇలా చెప్తూనే మరో అడుగు ముందుకేసి, వ్యక్తి ఔన్నత్యానికి వ్యక్తిగత వికాసానికి ఆర్థిక సాంస్కృతిక హక్కులు అనివార్యమనీ స్పష్టం చేసింది, ఈ మానవ హక్కుల పత్రం.

ఈ నేపథ్యంలోనే......కొన్ని పదుల సంఖ్యలో నున్న వర్ధమాన దేశాల్లో అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచబాంకు 'సాంఘిక భద్రత' నే విచ్ఛిన్నం చేయపూనుకున్నాయి. విద్య, వైద్యం వంటి ప్రజాహిత సేవల్లో ప్రభుత్వ వెచ్చింపులను నియంత్రిస్తున్నాయి. ప్రభుత్వ పాఠశాలలను మొదలుకొని, ప్రభుత్వాసుపత్రులదాకా వినియోగ ఛార్జీలను విధించమంటు న్నాయి. వేతన స్థాయిని నియంత్రిస్తూ బహుళజాతి సంస్థల వికాసానికి బద్దుల్ని కమ్మని ఆదేశిస్తున్నాయి. 'సాంఘిక భద్రత' ను నియంత్రించడమే కాకుండా, ప్రజాస్వామ్య విలువలను సైతం కాలరాయ ప్రయత్నిస్తున్నాయి కూడా. ప్రజానేతలు, ప్రభుత్వాధికారులను ప్రజాసేవకులుగా కాకుండా, జవాబుదారీ తనం నుండి వైదొలగి, 'వాల్‌స్ట్రీట్' సంతృప్తి మేరకు మసలేలా ఆదేశిస్తున్నాయి. ఈ కారణంగానే 1976 నుండి ప్రపంచ వ్యాప్తంగా వందకుపైగా నిరసన ప్రదర్శనలు వ్యక్తమైనాయి. ఈ విధానాల ఫలితంగానే, హైతీ, మెక్సికోల్లో ప్రజల నిజ వేతనాలను తగ్గిస్తూ తమ ఉనికిని తామే కోల్పోయేలా చేసిన వైనం మనముందుంది. దక్షిణ ఆఫ్రికాలో ప్రజలనెత్తిన యూజర్ ఛార్జీల పెను భారాలను మోపి, ఆ దేశ వైద్య, ఆరోగ్య ప్రయోజ నాలను రుణవసూళ్ళ వనరులుగా మళ్ళించి, ఎయిడ్స్ వంటి భయంకర వ్యాధులకు సామాన్యులు బలయ్యే పరిస్థితులకు నెట్టేయడం జరిగింది.

కొలంబియాలో సాంఘిక సేవల నుండి ప్రభుత్వాన్ని దూరం చేసి, అంతర్యుద్ధపు పరిస్థితులకు దారి తీసేలా చేసాయి. బ్రెజిల్ వంటి అనేక యితర దేశాల్లో అంతర్గత రాజకీయ విధాన నిర్ణయాల్లో తలదూర్చి ఓ వర్గపు కొమ్ము కాయటం చర్చనీయాంశంగా మారింది. యిలా అనేక దేశాల రాజకీయ విధానాల్లో పెత్తనంచేస్తూ, జాతీయ వనరులను కొల్లకొడుతూ.. జాతీయ ప్రజాస్వామ్యాల్ని మంటగలిపే యత్నంలో వున్నాయి.

ఈ తరహా ప్రయోగాల్లో మనం కూడా ఒకరమే. రేపటి మన భవిష్యత్ దర్శనం పై ఉదాహరణలకు ఏమాత్రం భిన్నంగా ఉండబోదు మరి....బహుపరాక్!

## ముంచుకొస్తున్న నీటి ప్రైవేటీకరణ

దేశవనరులనే కాకుండా.....మానవాళి మనుగడకు అత్యంత ఆవశ్యకమైన నీటిని సైతం కార్పోరేట్ పరా చేసి అమ్మకానికి ఒడిగడుతున్న దుర్మార్గపు యోచన ప్రబలుతోంది. జీవనా ధారమైన నీటిని ప్రైవేటీకరించి వ్యక్తిగత ప్రయోజనాలకు పావుగా మార్చే దుర్నీతికి అంకురార్పణ జరుగుతోంది. కాదు, యిప్పటికే జరిగింది. అందుకే విస్తారంగా వెలసి విలసిల్లుతున్న మినరల్ వాటర్ బాటిల్ సంస్కృతి. వాటర్ బాటిల్స్‌గానే కాదు. ప్రయాణ ప్రాంగణాలలో 'వాటర్‌పేకెట్స్' సైతం వినియోగం లోకి వచ్చేసాయి. ఈ తరహాలో సాలీనా దేశవ్యాప్తంగా 18 కోట్ల రూపాయలమేరకు నీటి వ్యాపారం సాగుతుందని ఓ అంచనా. అయితే యిదేదో యాదృచ్ఛికంగా జరుగుతుందయితే కాదు. అయితే ప్రపంచవ్యాప్తంగా చేపడుతున్న ఓ లాభసాటి వ్యాపారం.

ముందస్తుగా మంచినీటి సరఫరాను ప్రభుత్వ బాధ్యత నుండి వైదొలగేటట్టు చేసి ప్రైవేటు యాజమాన్యానికి అప్పగించి ఆపై ప్రపంచ నియంత్రణ దిశగా పరిణమింపజేసే ఆలోచనే దీనికి పునాది. యిందుకు తాజా ఉదాహరణగా అంట్లాంటా, బెర్లిన్, బ్యూనోస్ ఎయిర్స్, బొలివియా, చార్ల్‌స్టన్, ఘనా, హ్యూస్టన్, నూజెర్సి సిటీ, పియోరియా, సాన్‌ఫ్రాన్సిస్కో వంటి అనేక ప్రాంతాల్లో మొదలయిందీ లాబీ. యిందుకు అనేక వ్యాపార సంస్థలు అమెరికాకు చెందిన అమెరికన్ వాటర్ వర్క్స్, యునైటెడ్ వాటర్ రిసోర్సెస్, ఫ్రాన్స్‌కు చెందిన వివేంది, సూయజ్ లియోనైజ్ వెలిసాయి.

ఈ ఉదంతాన్ని రెండేళ్ళ క్రితమే ఫార్ట్యూన్ పత్రిక 20వ శతాబ్దిలో చమురు ఆక్రమించిన స్థితికి 21వ శతాబ్దంలో నీరు చేరుకోనుందని వ్యాఖ్యానించింది. రానున్న 20 ఏళ్ళలో ప్రపంచ జనాభాలో మూడింట రెండువంతుల జనాభాకు నీరు లభ్యం కాక అల్లాడిపోతారని ప్రపంచబ్యాంకు అంచనా వేసింది. యిందుకనువుగానే నేటి 'నీటి ప్రైవేటీకరణ' ప్రయత్నానికి ఆదేశాలు.

ఏదేశమైనా 'ప్రైవేటీకరణ' ప్రయత్నాలు ఒక బాటలో.....

ముందుగా నీటిపంపులు సక్రమంగా పనిచేయవు. దీనికి తోడు ఆకాశాన్నంటే వినియోగింపు బిల్లులు, మురికినీరు, అప్పుడప్పుడు మన పంపుల్లో ప్రత్యక్షమవడం...వాటర్ పైప్స్ లీకేజీలు...వగైరాలతో ప్రారంభమయి వందలవేల ఫిర్యాదులు పేరుకుపోతాయి. "ప్రైవేటు పరమైనా బాగుణ్ణు. సకాలంలో మంచినీళ్ళ యినా దొరకుతాయని" అన్పించేలా......ఈ ప్రభుత్వ సర్వీసులు కునారిల్లుతాయి. తామాశించిందీ అదే కనుక.... ప్రైవేటు పరం అయిపోతుందీ 'నీటి సరఫరా' వచ్చే ప్రైవేటు కాంట్రాక్టరు మనం చెల్లించిన మొత్తాల్ని జేబులో వేసేసుకుని.... సరఫరా సమస్యల్ని గత కాలపు కార్పోరేషన్ నెత్తిన రుద్ది చేతులు దులిపేసుకుంటాడు.

కోర్టులకెక్కినా....వాణిజ్య లాబీలు, అణువణువునా విస్తరించిన అవినీతి....జీవనాధార నీటిని....వాణిజ్య సరుకుగానే పరిగణించేందుకే దోహదపడతాయి. అమెరికాలో జరిగిందీ యిదే....

వాటర్ ఇన్వెస్ట్‌మెంట్ ఏక్ట్ 2002...సెక్షన్ 103(జె) (1) (బి) స్థానిక ప్రభుత్వం "నీటి ప్రైవేటీకరణను ఆమోదించనిదే ప్రభుత్వ సహాయాన్ని మీ నీటి పథకాలకు అందివ్వలేదని చెపుతుంది. నీటి సరఫరాను ఆధునీకరించేందుకు పెద్ద ఎత్తున మొత్తాలు అవసరమైనందున ప్రభుత్వ సహాయం పొందాలంటే ప్రైవేటీకరించాలి మరి" అన్నది.

నడుస్తున్న మన 'నీటి చరిత్ర' ను పరికిస్తే..చాలా సూక్ష్మంగా అవగతమయ్యేది యిదే. ప్రజా సంక్షేమం ప్రైవేటు శక్తుల సంక్షేమంగా మారటమే ప్రైవేటీకరణలో దాగున్న బహిరంగరహస్యం 'విద్యుత్ రంగం' ప్రైవేటీకరణలోనూ జరిగిందిదే. ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణలోనూ యిదే. రేపు మంచినీటి ప్రైవేటీకరణలోనూ జరగబోయేదిదే. యింక సందేహం అఖ్ఖర్లేదు.

## ప్రపంచీకరణ ఫలితాలు తిరోగమన దిశలోనే....

ఆగస్టు 10, 2000న ప్రపంచ బాంకు పరిశోధనా అధ్యయనం విడుదలచేసిన నివేదికలో ద్రవ్యనిధి సంస్థ ప్రపంచబాంకు విధానాలు అభివృద్ధిచెందుతున్న 'ఆర్థిక విధానాల' పరిపుష్టికి, పేదప్రజల ప్రయోజనాలకు దోహదపడు తున్నాయని పేర్కొనడం జరిగింది. కానీ వాషింగ్టన్‌కు చెందిన పరిశోధనా సంస్థ అధ్యయనం - ఈ నివేదిక పేర్కొన్న అంశాలను కొట్టిపారేసింది.

బాంకు ఆర్థికవేత్తలు డేవిడ్‌డాలర్, అరేక్రే పత్రాన్ని ప్రపంచబాంకు అభివృద్ధి పరిశోధనా గ్రూపు గతమార్చ్‌లో విడుదల చేయగా, 'గ్లోబలైజేషన్' బాంకు విధానాలు అన్న ఆ పత్రాన్ని నూతన పరిశోధనా గణాంకాలతో విమర్శకులు కొట్టొచ్చినట్టుగా విమర్శించారు. "అభివృద్ధి సాధారణంగా పేదలకు మేలుచేసేది గా వుండాలంటూ....ఈ లక్ష్యంతో వున్నవారు మంచిపాలనా విధానాలను...ఆర్థిక సుస్థిరతను.... అంతర్జాతీయ వాణిజ్యంలో బహిర్గతంగానూ వుండాలనీ" చెప్పక తప్పలేదు.

వాషింగ్టన్‌కు చెందిన ఆర్థిక విధాన పరిశోధనా కేంద్రం (సిఇపిఆర్) అయితే అసలీ 'ప్రపంచీకరణ' పేదల అభివృద్ధికి

దోహదపడకపోతే మానే...కనీసం ఏ రకమయిన అభివృద్ధికయినా దోహదపడుతుందా? అని ప్రశ్నించింది. పైగా, ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచబ్యాంకు తమ విధాన అమలుద్వారా 'అభివృద్ధి' సాధించిన 'ప్రాంతమంటూ అసలీ ప్రపంచంలో వుందా' అని కూడా ప్రశ్నించింది.

'మనందరికీ మరో మంచి ప్రపంచం' అన్న డాలర్, క్రేలు విడుదల చేసిన నివేదికలో పేర్కొన్న ఏ ఒక్క గణాంకాలతోనూ సి.ఇ.పి.ఆర్ ఏకీభవించలేకపోయింది. కనీసపు 'అభివృద్ధి' పేదల ఆదాయాల 'పెరుగుదల' వంటి వివాదరహిత అంశాల్లోనూ ఈ ఏకీభావం కుదరలేదు.

యిటీవల మూడేళ్ళక్రితం అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ దీని అనుబంధ రుణదాతలు చేపట్టిన రుణ విధానాలు....వందల మిలియన్ల పేదల ఆర్థిక ప్రగతిని హరించివేసేవిగా వున్నాయని సిఇపిఆర్ స్పష్టం చేసింది. ఆసియన్ ఆర్థిక సంక్షోభంలో ద్రవ్యనిధి సంస్థ చేపట్టిన విధానాలు, వ్యాపార మాంద్యాన్ని తీవ్రతరం చేస్తూ లక్షలాది పేదలను ఉత్పత్తి చేసిందని ఈ సంస్థ స్పష్టం చేసింది.

ముందుగా ద్రవ్యమార్కెట్‌లను విచక్షణారహితంగా ప్రవేశపెట్టి పెట్టుబడులను కార్యభారానికినెట్టి, ద్రవ్య మార్కెట్ లను కుప్పకూలేటట్టు చేసి ఆసియా ఖండాన్నే తిరోగమన 'సుడి' లోకి నెట్టివేసిందని ఈ ఆర్థిక విధాన పరిశోధనా కేంద్రం వ్యాఖ్యానించింది.

1998లో రష్యా, బ్రెజిల్ దేశాల లావాదేవీలన్నింటిలోనూ ఐఎంఎఫ్ ప్రత్యక్ష జోక్యం కల్గించుకోవడంతో, అనివార్యంగా ఆ రెండు దేశాల ఆర్థిక వ్యవస్థలూ పతనమయి ఘోర ఆర్థిక వినాశనానికి హేతువైంది. గత దశాబ్దిలో ఐఎంఎఫ్ విధానాల వలన సోవియట్ యూనియన్ ఘోర పతనాన్ని చవి చూసింది. ఫలితంగా సుమారు 40 శాతం జాతీయాదాయాన్ని అప్పుల చెల్లింపులకే వెచ్చించాల్సి వచ్చింది.

ఈ కారణంగానే గత రెండు దశాబ్దాలూ అభివృద్ధి చెందుతున్న వ్యవస్థలకు గ్రహణకాలం వంటివని ఆర్థిక విధాన పరిశోధనా కేంద్రం వ్యాఖ్యానించింది. సామాన్యంగా విదేశీ పెట్టుబడులు, అంతర్జాతీయ వాణిజ్య విధానాలవలన ఆర్థిక లాభాలు వుండాలి. కానీ యీ తరహాలో వినాశనానికే దారి తీస్తున్నాయంటే ఖచ్చితంగా ఐ.ఎం.ఎఫ్. ప్రపంచబాంకు అవలంబిస్తున్న విధానాల్లో ఏదో లోపం తప్పక వుండి వుంటుంది.

ఈ దుష్పరిణామాలకు అడ్డుకట్ట వేయాలంటే, కచ్చితంగా ఈ సంస్థలనుసరిస్తున్న విధి విధానాలపై నిజాయితీతో కూడిన 'సమీక్ష' తప్పకుండా అవసరమౌతుంది. ఈ 'సమీక్ష' ప్రపంచ బాంకు ద్వారానే జరిగితే నిర్మాణాత్మకమైన పరిష్కారాలను వెతుక్కునే వీలుంటుంది. రుణాధారిత దేశాలు గతఅనుభవాల పునాదిమీద, సమానత్వ అభివృద్ధి కనువైన విధానాలను అనుసరించే వెసులుబాటూ కలుగుతుందని ఆర్థిక విధాన పరిశోధనా కేంద్రం సూచించింది.

గత 20 ఏళ్ళలో సామాన్య ప్రజల అభివృద్ధికి దోహదపడని విధానల అమలుకే ఈ ఐఎంఎఫ్, ప్రపంచబాంకు పాల్పడటం.... నిజంగా పేదవర్గాలకు 'అన్యాయం' చేయడమే. ఈ విషయం... ఆర్థిక ప్రగతికి...పేదవర్గాల ఆదాయ పెరుగుదలకు ఏ విధమైన సారూప్యత లేకపోవడం ఈ ధోరణినే బలపరుస్తోంది. యిదే తరహాలో తలసరి ఆదాయాలు పెరుగుతున్నాయని చెప్తున్న దేశాల్లో సైతం...పేదవర్గాలు, సామాన్య ప్రజల్ని ఈ ప్రపంచీకరణ ధోరణుల్లో ఉపేక్షించడం జరిగిందని చెప్పడానికి కోకొల్లలుగా ఉదాహరణలను పేర్కొనవచ్చని ఈ ఆర్థికవిధాన పరిశోధనా పత్రం పేర్కొంది. డాలర్ క్రే, పరిశోధనలు, ప్రపంచబాంకు, ఐఎంఎఫ్ అనుసరిస్తున్న విశ్వజనీన ఆర్థిక నిబంధనలను, వాణిజ్య వ్యాప్తి, ప్రైవేటీకరణ, ప్రభుత్వాల పరిధి నియంత్రణా ధోరణులతో 'ఆర్థికాభివృద్ధి' ని సాధించడంలో తప్పేముందని అమాయకంగా ప్రశ్నిస్తున్నాయి. యిందుకనువైన పరిష్కారంగా, ఆయా దేశాల ప్రభుత్వాలను, ఆయా దేశాల సాంఘిక, భౌగోళిక రాజకీయ పరిస్థితులకనువైన విధి విధానాలను అమలు పర్చుకునే వెసులుబాటును కల్పిస్తూ అభివృద్ధి పెరుగుదలను పరిశీలించమంటుంది ఈ ఆర్థిక విధాన పరిశోధనా పత్రం...

యిందుకు ఒకే ఒక్క ఉదాహరణ : లాటిన్ అమెరికా 1960-1980 మధ్య కాలంలో 75 శాతం స్థూలాదాయ పెరుగు దలను నమోదు చేయగా, తదుపరి కాలంలో ఈ పెరుగుదల కేవలం 6 శాతానికే పరిమితమయిందని, దక్షిణ ఆఫ్రికాలో యిదే కాలపు స్థూలాదాయం 36 శాతం నుండి 15 శాతానికి పడి పోయిందని, యిందుకు ఐఎంఎఫ్, ప్రపంచ బాంకులు అనుసరిస్తున్న విధానాల ఫలితమేనని...సిఇపిఆర్ స్పష్టం చేసింది. ■

('ఇంటర్‌నెట్' నుండి సంక్షిప్త స్వేచ్ఛానువాదం)

## ఆంధ్రప్రదేశ్‌లో జనాభా పెరుగుదల

| జనాభా (సం॥) | జనాభా (మిలియన్లు) | పెరుగుదల శాతం | జనసాంద్రత (చ .కి.మీ.లలో) |
|---|---|---|---|
| 1951 | 31.11 | 14.02 | 113 |
| 1961 | 35.98 | 15.65 | 131 |
| 1971 | 43.50 | 20.90 | 157 |
| 1981 | 53.55 | 23.10 | 195 |
| 1991 | 66.51 | 24.20 | 242 |
| 2001 | 75.73 | 13.86 | 275 |

ఆధారం : గణాంక సంగ్రహం, అర్థగణాంక శాఖ, హైదరాబాద్.

—పుస్తక సమీక్ష—

# స్వేచ్ఛ నుంచి పలాయనం

ప్రస్తుత స్థితిని చేరుకునే ముందు, మానవ చరిత్ర పలుదశలలో నడిచింది. వాస్తవానికి నేడు వివిధ సమాజాలు, దేశాలు, వివిధ అభివృద్ధి దశలలో ఉన్నాయి. కానీ, నేడు గ్లోబలైజేషన్‌పేరుతో అమలు జరుగుతున్న ప్రపంచ వ్యాపిత ఆర్థిక విధానాల వలన, దరిదాపుగా ప్రపంచంలోని అన్ని దేశాలు ఒకే తరహా సామాజిక ఆర్థిక వ్యవస్థను ఏర్పరచుకొంటున్నాయి. అదే పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ. ప్రపంచంలోని అన్ని దేశాలు వేగంగా పెట్టుబడిదారీ మార్కెట్ వ్యవస్థలోకి లాగి వేయబడు తున్నాయి. ఈ పరిస్థితి ఏర్పడకముందు, ప్రపంచంలోని పలు మూడవ ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థలు ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థలో వున్నాయి.

ఫ్యూడల్ వ్యవస్థలో, సామాజిక సంబంధాల సాంద్రత ఎక్కువగా ఉండేది. అంటే, ఆ సమాజాలలో మానవులు, నిర్దిష్టపాత్రలు, బాధ్యతల చట్రంలో ఇమిడి ఉన్నారు. వారి సామాజిక ఆర్థిక స్థితిగతుల మార్పుకు బహు తక్కువ అవకాశాలు వున్నాయి. అయితే పెట్టుబడి దారీ వ్యవస్థ విశ్వవ్యాపితం అవుతుండడంతో, ఈ పరిస్థితి వేగంగా మారి పోతుంది. సామూహిక జీవన విధానాలు (జాయింట్ ఫ్యామిలీ వంటివి) కుప్ప కూలి పోతున్నాయి. అంటే సామాజిక కుటుంబ సంబంధాల ద్వారా మనుష్యులకు మానసిక భద్రతా స్థితి వుండే పరిస్థితి వేగంగా మారిపోతుంది. వ్యక్తి తన మానసిక - ఆర్థిక అవసరాలకై తన కాళ్ళపై తానే నిలబడవలసి వస్తోంది. తమ అస్థిత్వాన్ని తామే నిర్వచించుకోవల్సి వస్తుంది. అంటే తగినంత మేర హేతుబద్ధత అభివృద్ధి చెందని స్థితిలో వున్న వ్యక్తులు పలువురు వ్యక్తిగత ఉనికి (Individualised Existence)లోకి నెట్టివేయ బడుతున్నారు. ఇటువంటి పరిస్థితిలో వ్యక్తులు తమకు కొత్తగా లభించిన స్వేచ్ఛను భయోత్పాతంతోనే స్వీకరిస్తున్నారు. ఆ స్వేచ్ఛ కల్పించే బాధ్యతాయుతంగా వ్యవహరించాల్సిన పరిస్థితి వారిని ఆందోళనకు, భద్రతా రాహిత్యానికి గురిచేస్తోంది.

ఈ నేపథ్యంలోనే, మానవ జీవితం ముందు రెండు ప్రత్యామ్నాయాలు ఉంటాయనే ఫ్రామ్ ప్రతిపాదనను చూడాలి. అవి జంతు ప్రవృత్తికి తిరోగమించడం లేదా నిఖార్సు అయిన మానవ అస్థిత్వాన్ని అందుకోగలగటం. అయితే జంతు ప్రవృత్తికి తిరోగమించడం వేదనకు, మానసిక రుగ్మతకు దారి తీస్తుందని ఫ్రామ్ అంటాడు. ఇది మానవుడిని భౌతికంగా లేదా మానసికంగా నిర్జీవిని చేయగలదనేది ఫ్రామ్ అభిప్రాయం. అయితే, పూర్తి పరిపర్వ మానవ అస్థిత్వాన్ని ఆవిష్కరించుకోగలగడం కూడా ఏమంత సులభం కాదనేది ఫ్రామ్ అభిప్రాయం. ఈ కారణం చేతనే మానసిక పురోగమనం దిశగా వేసే ప్రతి అడుగు భయాన కంగానూ, బాధాకరంగానూ ఉంటుందని ఫ్రామ్ పేర్కొన్నాడు. ఈ ప్రత్యేక కారణం దృష్ట్యానే, మానవుడు ప్రస్తుత సమాజంలో మానసిక పురోగమనం దిశగా తొలి అడుగులు వేయడానికి భయపడుతున్నాడనిపిస్తుంది. మానసిక తిరోగమనపు ఫలితాలు ఎంత దుర్భరమైనవి అయినా ఆదిశగా పయనించడమే సులువు గనుక, దాని తాలూకు పరిణామాలను ఆలోచించకుండానే నేటి సమాజంలోని పలువురు సులువైన మార్గమైన తిరోగమనాన్ని ఎంచుకుంటున్నారు. దీని ఫలితమే ఫ్రామ్ పేర్కొన్న "స్వేచ్ఛ నుంచి పలాయనం"గా మనం గుర్తించవచ్చు. అంటే, వారు తమ స్వేచ్ఛను, తగిన మానసిక భద్రతకై ఏదో ఒక "గొప్ప వ్యక్తికి లేదా నియంతకు" లొంగిపోయేందుకు వెనుకాడ రనేది ఫ్రామ్ ప్రతిపాదన.

ఈ నేపథ్యంలోనే నేటి భారతదేశ స్థితిని మనం చూడవచ్చు. నిన్నా మొన్నటి ఫ్యూడల్ సంబంధాల భద్రత, ఉదారవాద ఆర్థిక విధానాల యుగంలో ఛిన్నాభిన్నమై పోతుంది. దీనితో నేడు, భారతదేశ ప్రజలలోని అనేకమంది నూతనంగా లభించిన స్వేచ్ఛను, బాధ్యతలను తట్టుకోలేని మానసిక భారంగా భావిస్తున్నారు. ఈ పరిస్థితిలో వారికి కావల్సింది స్వేచ్ఛ నుండి తప్పుకోవడం అంటే, ఫ్రామ్ వివరణల నేపథ్యంలో చూస్తే, నేడు భారతదేశ ప్రజలు ఒక ఉనికి రీత్యా సందిగ్ధావస్థలో వున్నారు. ఈ పరిస్థితి ప్రమాదకరం. ఈ స్థితిలో మనం ఏర్పరచుకున్న ప్రజాతంత్ర వ్యవస్థలు, రాజ్యాంగం కుప్పకూలే అవకాశాలు మెండుగా వున్నాయి. హేతుబద్ధత, తోటి మానవుల పట్ల ప్రేమలపునాదిపై అర్థవంతమైన జీవితాన్ని ప్రత్యామ్నా యంగా ఇచ్చినప్పుడు మాత్రమే రానున్న ఉపద్రవాన్ని నిలువరించగలం. అయితే ఈ ప్రత్యామ్నాయానికి వున్న ఆచర ణాత్మక అవకాశాలు బహుస్వల్పం.

పెట్టుబడిదారీ వ్యవస్థలో స్వేచ్ఛ నుంచి పలాయనం అనేది పరాయికరణ భావం చుట్టూ కేంద్రీకృతమై వుంటుంద నేది ఫ్రామ్ అభిప్రాయం. ఈ వ్యవస్థలో కార్మికుడి శ్రమ మరింత యాంత్రికంగానూ, ఆలోచనా రహితంగానూ మారిపోతుందని ఫ్రామ్ వివరించాడు. సృజనాత్మకత, కుతూహలత, స్వతంత్ర ఆలోచనలకు తావులేకుండా పోతుందని ఆయన పేర్కొన్నాడు. దీని ఫలితంగా కార్మికుడు తిరగబడటమో లేదా పలాయాన వాదిగా మారిపోవడమే జరుగుతోందని ఫ్రామ్ విశ్లేషించాడు. ఈ మొత్తం ప్రక్రియలో, కార్మికుడు మానసికంగా

తిరోగమన ధోరణులకు లోనవుతున్నాడని వివరించాడు. ఈ వివరణ, పరాయీకరణ భావానికి ఆమోద యోగ్యతను, విస్తృత ప్రాచుర్యాన్ని కల్పించిన మార్క్స్ భావనలతో సరిపోల్చి చూడవచ్చు. మార్క్స్ భావనలో పరాయీకరణకు ప్రయివేటు ఆస్తి కారణం. పరాయీకరణవలన, వ్యక్తులు భౌతిక, నైతిక పతనానికి లోను అవుతారని మార్క్స్ పేర్కొన్నాడు. దీని వలన కార్మికుడి సహజ సిద్ధ మానవ స్వభావం వక్రీకరణకు లోనవు తుందని ఆయన వివరించాడు. పరాయికరణ వలన కార్మికులు తమ శ్రమలోని సృజనాత్మక భాగాన్ని కోల్పోతారని మార్క్స్ పేర్కొన్నాడు. అలాగే, కార్మికుడు తన భౌతిక, మానసిక శక్తి సామర్థ్యాలను స్వేచ్ఛగా అభివృద్ధి చేసుకోలేడని, వాటిని అణచి వేసుకుంటాడని విశదీకరించాడు. అంటే, తన సహజ స్వభావాన్ని కోల్పోయి జంతు స్థితికి దిగజారిపోతాడని పేర్కొన్నాడు. ఈ రకంగా చూస్తూ పోతే పరాయీకరణగురించిన ఫ్రామ్, మార్క్స్‌ల అభిప్రాయాలలో చాలా సారూప్యత కనపడుతుంది.

హైటెక్ పరిశ్రమ ఆవిర్భావంతో బిజినెస్, ప్రాసెస్, రీ యింజనీరింగ్ వంటి పలు ప్రక్రియల ద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థలో పరాయీకరణకు కాలం చెల్లిందని పలువురు పెట్టుబడిదారీ మేధావులు చెప్పుకుంటున్నారు. అయితే, ఈ రంగంలోని పరిశ్రమలలో కూడా పరాయీకరణ వున్నది. గతంలో మునుపెన్నడూ లేని స్థాయికి ఇది చేరుకున్నది అనడానికి "గ్లోబల్ స్క్వీజ్ - ద కమింగ్ క్రైసిస్ ఫర్ ఫస్ట్ వరల్డ్ నేషన్స్" అనే పుస్తకంలో రిచర్డ్ సిలాంగ్ వర్త్ ఇచ్చిన సోదాహరణ మైన వివరణలలో, కొన్ని సంక్షిప్తంగా చూద్దాం. పరాయీకరణ నిజంగా అధిగమించబడా లంటే, ముందుగా వేతన బానిసత్వం, అదనపు విలువలు తొలగించబడాలి. కాగా పెట్టుబడి దారీ ప్రపంచంలో కూలీ బానిసత్వం ప్రగాఢమౌతుంది అనటానికి, అదనపు విలువల దోపిడీ తీవ్రతరమౌతుంది అనటానికి, ఈ పుస్తకంలో పలు ఉదాహరణలు వున్నాయి. శ్రమశక్తి సరఫరా తాలుకు సప్లై- డిమాండ్ వ్యవస్థ రెండు రకాలుగా పనిచేస్తున్నది. కొందరు ఉద్యోగులు, కొన్ని పదార్థాలలా అరుదైన, విలువైనవారు, వీరికి నింగిని అంటే వేతనాలు లభిస్తున్నాయి. అంటే, నూతన ప్రపంచ ఆర్థిక వ్యవస్థను నడిపించగలవారికి భారీ వేతనాలు లభిస్తు న్నాయి. కాగా ఇతరులు, అంటే సామాన్య కార్మికుల విలువ పడిపోతుంది అని లాంగ్ వర్త్ గణాంకవివరాలతో వివరించాడు. ఈ నేపథ్యంలో చూస్తే అమెరికా పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికుల వేతనాలు, సామాజిక సదుపాయాలు భారీగా అభివృద్ధి చెందాయనే ఫ్రామ్ వివరణకు కాలం చెల్లిందనిపిస్తోంది. అలాగే పారిశ్రామిక రంగంలో కార్మికుని పాత్రబాగా పెరిగిందనే ఫ్రామ్ వాదన కూడా నేటి కార్మికుల జీవన స్థితిగతుల దృష్ట్యా నిస్సారంగా మిగిలిపోతుంది. రీగన్, థాచర్ వంటి మితవాద రాజకీయ నాయకుల ప్రాబల్యం క్రింద పారిశ్రామిక రంగంలో కార్మికుల హక్కులు అడుగంటిపోయాయి.

గతంలో, అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ ఆరంభదశలో స్వయం ఉపాధి కల్పించుకున్న ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల సంఖ్య గణనీయంగా ఉందని ఫ్రామ్ వివరించాడు. దీనికి తార్కాణంగా పందొమ్మిదో శతాబ్దం ఆరంభంలో ఐదింట నాలుగు వంతుల మంది తమ ఉపాధిలో స్వావలంబనతో ఉండటాన్ని ఆయన సూచించాడు. కాగా రాను రానూ ఈ ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల సంఖ్య కుచించుకు పోతుందని ఫ్రామ్ వివరించాడు. మరో ప్రక్క పెద్ద పెద్ద పరిశ్రమలలో ఉద్యోగులుగా పనిచేసేవారి సంఖ్య పెరుగుతూ పోతుందనీ ఫ్రామ్ గణాంక వివరాలతో వివరించాడు. అయితే, ఆటోమేషన్, కంప్యూటర్ పరిజ్ఞానాల రంగప్రవేశంతో దరిదాపు అన్ని పెద్ద పరిశ్రమల్లోను ఉపాధిపై వేటుపడుతోంది. ఉద్యోగుల సంఖ్యను కుదించి వేయడం నేటి పారిశ్రామిక రంగంలో దైనందిన కార్యక్రమంగా మారింది. అంటే పందొమ్మిదో శతాబ్దపు ఔత్సాహిక పారిశ్రామిక వేత్త స్థానంలో ఇరవయ్యవ శతాబ్దంలో వేతన కూలీలు వచ్చారు. నేడు పలువురు ఉద్యోగులకు ఈ వేతన కూలీ స్థితి కూడా గగన కుసుమంగానే ఉంటోంది. అమెరికాలో ఉపాధి కోల్పోయిన మధ్య స్థాయి మేనేజర్లు, తమ లాప్‌టాప్‌లతో కన్సల్‌టెంట్‌ల పేరిట ఉపాధి మార్కెట్ లోకి రావటాన్ని, మనం మన నగరాలలోని పలు అడ్డాలలో రోజువారీ కూలీలు ఉపాధికై గుమికూడటంతో సరిపోల్చి చూడవచ్చునేమో!

పై పరిణామాలు మధ్య తరగతి వర్గం వేగంగా శ్రేణులలో చేరి పోవటాన్ని సూచిస్తున్నాయి. అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ విస్తరించి వ్యాపించిన కొద్దీ, దానిలో అధికశాతం జనాభా వేతన కూలీలుగా మారిపోతున్నారు. కాబట్టి, పెట్టుబడిదారీ దోపిడీ పెరిగిపోయి, పరాయీకరణ మరింతగా పెరుగుతోంది. కాబట్టి, పరాయీకరణను గురించిన ఎరిక్ ఫ్రామ్ ఆందోళన నేడు మరింత అర్థవంతమైనది. ఈ విధంగా పరాయీకరణ పెరిగిపోవడం వలన, పెట్టుబడిదారీ 'వ్యవస్థలో' ఒక ఉన్మాద స్థితి ఏర్పడుతోందని ఫ్రామ్ రచించిన 'The Sane Society' అనే పుస్తకం నుంచి అర్థం చేసుకోవచ్చు.

పెట్టుబడిదారీ వ్యవస్థ మొత్తం మీద, ఆర్థికంగా మరింత సంపన్నవంతం అయింది. అయితే ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలన్నింటిలోనూ ఒకేమారు ప్రగతిని సాధించ లేకపోతే ఆ ప్రగతి గనుక వీటిలో ఏదో ఒక రంగానికే పరిమిత మైతే, అది మిగతా అన్ని రంగాలపైనా వినాశకర ప్రభావాన్ని చూపుతుంది అనే ఫ్రామ్ ప్రతిపాదన కూడా నేడు మనం గుర్తు చేసుకోవచ్చు. ఒకపక్క పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉత్పాదకత వేగంగా పెరుగుతుండగా మరోపక్క ఆర్థిక అస మానతలు కూడా భారీగానే పెరుగుతున్నాయి. గత యిరవై సంవత్సరాల కాలంలో అమెరికాలోని భౌతిక శ్రమ కూడా భారీ గానే పెరుగుతున్నాయి. గత యిరవై సంవత్సరాల కాలంలో అమెరికాలోని భౌతిక శ్రమ చేసే కార్మికులు తమ కొనుగోలు శక్తిలో పదిహేను శాతాన్ని కోల్పోయారు. 1979వ సంవత్సరంలో సాధారణ ఫ్యాక్టరీ కార్మికుడి కంటే కంపెనీలోని అత్యున్నత స్థాయి అధికారి వేతనం 29 రెట్లు ఎక్కువగా ఉంది. కాగా ఈ అగాధం 1992వ సంవత్సరం నాటికి 100 రెట్లకు పెరిగింది. ఐక్యరాజ్య సమితి నివేదికల ప్రకారంగానే (1996) ప్రపంచంలోని 358 మంది బిలియనీర్ల ఆస్తుల మొత్తం ప్రపంచంలోని 45% జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తున్న దేశాలన్నింటి

ఆదాయం కంటే అధికంగా ఉంది. అమెరికా జనాభాలోని పై ఒక్కశాతం లోని వారు, ఆ దేశంలోని పారిశ్రామికవాటాల్లో 37 శాతాన్ని, ప్రైవేటు వ్యాపార ఆస్తులలో 50శాతాన్ని కలిగి ఉన్నారు. కాగా 38 మిలియన్‌ల మంది అమెరికా ప్రజలు పేదరికంలో మగ్గు తున్నారు.

ఓ ప్రక్క ఉత్పాదకత పెరగటం, మరో ప్రక్క దారిద్ర్యం పెరగటంతో పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలోని ఆర్థిక రంగం తాలూకు అసహేతుకతను ఫ్రామ్ ఎండగట్టాడు. ఒక ప్రక్క పూట కూటికి నోచుకోనివారు కోట్లాదిమంది ఉండగా, మరో ప్రక్క, పంటలు బాగా పండటాన్ని ఆర్థిక వినాశకంగా భావించే ధోరణిని ఆయన దీనికి ఒక ఉదాహరణగా పేర్కొన్నాడు. మార్కెట్‌ను స్థిరీకరించే పేరుతో వ్యవసాయ ఉత్పా దకతను పరిమితం చేయడాన్ని ఆయన నిరశించాడు. నేడు భారతదేశంలోని వ్యవసాయ రంగంలో నెలకొని ఉన్న పరిస్థితి కూడా దీనికి మచ్చుతునక. ఒక ప్రక్క ఎఫ్.సి.ఐ. గోడౌన్లలో పేరుకుపోయాయని చెబుతున్న ధాన్యం నిలువలు ఆ పేరుతో క్రాప్ హాలిడేలు, మరో ప్రక్క అర్ధాకలితో పస్తులుంటున్న కోట్లాది మంది ప్రజలు-ఈ పరిస్థితి, నాడు అమెరికాను ఉద్దేశించి ఫ్రామ్ పేర్కొన్న స్థితినే పోలి ఉంది. అలాగే, ఆయుధాల ఉత్పత్తిని కూడా ఫ్రామ్ ఎండగట్టాడు. ఆర్థిక వ్యవస్థను కాపాడుకొనేందుకు, అంతూ పొంతూ లేకుండా ఆయుధాల ఉత్పత్తి సాగించడం మంచి ఆర్థిక విధానంగా చెలామణిలో ఉండగా - ప్రభుత్వం గనుక తలదాచుకునే గూడులేనివారికి ఇళ్ళు కట్టిస్తాను అంటే, ఆ ప్రతిపాదనను మాత్రం స్వేచ్ఛకు, వ్యక్తిగత చొరవకు ప్రమాద కరమని గగ్గోలు పెట్టేవారు వున్న "రుగ్మతాగ్రస్త" వ్యవస్థగా, పెట్టుబడిదారీ వ్యవస్థను ఆయన విశ్లేషించాడు. అలాగే, ఛీత్కార యోగ్యమైన కార్యక్రమాలను మీడియా ప్రజల ముందు వుంచు తున్నప్పుడు, ప్రభుత్వం గనుక, ఏదైనా మంచి, ఆరోగ్యవంతమైన ఎంటర్‌టైన్‌మెంట్ కార్యక్రమ నిర్మాణానికి నిధులిస్తే - స్వేచ్ఛా, ఆదర్శవాదం పేరుతో దానిని విమర్శించే పరిస్థితి పెట్టుబడిదారీ వ్యవస్థలో వుందని ఆయన పేర్కొన్నాడు.

సాంకేతిక పరిజ్ఞానం పెరిగిన తరువాత, ప్రజలకు ఎక్కువ ఫ్రీ టైమ్ లభిస్తుందని ఆయన పేర్కొన్నాడు. కాగా, వాస్తవానికి నేడు ఈ పరిస్థితిలో మార్పు వచ్చింది. హై-టెక్ యుగంలో, అంతా ఫ్రీ టైమ్ వున్నవారు (అంటే నిరుద్యోగులు), లేదా సోకాల్డ్ వీకెండ్స్‌లో కూడా ఓవర్‌టైమ్‌చేస్తున్న అస్సలు ఫ్రీ టైమ్ లేనివారు - ఇదీ నేటి పెట్టుబడిదారీ వ్యవస్థలో వచ్చిన మార్పు. ఈ కారణం చేతనే, షాపింగ్‌లకు టైమ్ లేక, వస్తువుల అమ్మకాలు పడిపోవడం వలన, జపాన్ ప్రభుత్వం తన దేశంలోని ఉద్యోగు లకు, (షాపింగ్‌లకై!) అదనంగా సెలవు తీసుకోవాల్సిం దిగా ప్రజలను బుజ్జగిస్తున్నది.

మొత్తం సమాజమే జబ్బుపడి వుందని, ఇది మెజారిటీ ప్రజల మనస్థితి కనుక అదే సామాన్యస్థితిగా చలామణి అవుతుందని ఫ్రామ్ పేర్కొన్నాడు. దీనికి ఒక చక్కటి ఉదాహరణ: అమెరికాలోని, ఒక బహిరంగ ప్రదేశంలో ఒక వ్యక్తి తన వింత మేనరిజమ్స్‌తో (నేటి చైనాలోని ఫాలున్ గాంగ్ లాగా) నలుగురి దృష్టిలో పడ్డాడు. దానితో 'నార్మల్'గా వున్న ఆ ఏరియా నివాసులు. ఈ వ్యక్తిని పిచ్చివాడిగా భావించి, పోలీసులకు అప్పగించారు. ఆ వ్యక్తి తన మేనరిజమ్స్ పిచ్చికాదనీ, అవి తమ ఆచారాలని పలు విధాలుగా పోలీసులకు నచ్చచెప్ప జూసాడు. అయితే ఇవేమి నమ్మని పోలీసులు, ఆ వ్యక్తిని మానసిక వైద్యశాలకు తరలించారు. అయితే మరుసటి రోజునే, ఈ వ్యక్తి చూపిన మేనరిజమ్స్ చూపుతున్న పలువురు, ఆ వ్యక్తి, తమ మతానికి చెందినవాడని, పిచ్చివాడు కాదని. ఆసుపత్రి యాజమాన్యం వద్దకు వచ్చారు. ఇంతమంది ఒకేరకం మేనరిజమ్స్ వున్న మనుషులు కనపడటంతో, తాము ఆసుపత్రిలో చేర్చుకున్న వ్యక్తి కూడా "సాధారణ" మనోస్థితిలోనే ఉన్నాడని నమ్మి ఆ వ్యక్తిని అతని కోసం వచ్చిన వారితో పంపించి వేసారు. అంటే నలుగురు చేసేది ఏదైనా సామాన్యమైందనీ, దీనికి భిన్నమైనది ఏదైనా అసామాన్యమని భావించటంవలన Insane Society 'Normal' గా చెలామణి అవుతుందని ఫ్రామ్ వివరించాడు. దీనికి పైన పేర్కొన్న ఉదాహరణే తార్కాణం.

సామాజిక - ఆర్థిక అభివృద్ధిలో భాగంగా భౌతిక సంపద దృష్ట్యా కంఫర్టబుల్ జీవితం, వీలైనంతమేర పంపిణీలో సమానత్వం, స్థిరమైన ప్రజాస్వామ్యం, శాంతియుత పరిస్థితులు అన్నవి పాశ్చాత్య ప్రపంచపు లక్ష్యాలని ఫ్రామ్ అంటాడు. కాని వాస్తవానికి ఫ్రామ్ ఈ మాటలు పేర్కొన్న దశాబ్దాల తరువాత, పాశ్చాత్య ప్రపంచం, ఈ లక్ష్యాల నుంచి కూడా వైదొలుగుతుంది. ఒకప్పుడు అభివృద్ధి చెందినదేశాలలో కార్మికుల జీవన స్థితి గతులు, వారి యజమానుల అదృష్టం ప్రకారం మారుతుండేవి. అంటే, ఉత్పాదకత పెరిగితే, మంచి ఉపాధి అవకాశాలు ఉండేవి. నిరుద్యోగం తక్కువగా ఉంటే, వేతనాల స్థాయి పెరిగేది. అయితే నేడు ఈ పరిస్థితి మారిపోయింది. ఉద్యోగుల సంఖ్యను కంపెనీలు తగ్గించినకొద్దీ, ఆ కంపెనీల వాటాల విలువలు పెరుగు తున్నాయి. అంటే, ఉద్యోగులకు ఏదైతే దుర్వార్త అవుతుందో, అది వారి యజమానులకు శుభవార్త అవుతోంది. అంటే భౌతికంగా కంఫర్టబుల్ జీవితం అనేది పాత అర్థంలో ఉద్యోగులకు ఇకలేదు. కార్పొరేట్ పరిశ్రమల లాభాల స్థాయి పెరిగినకొద్దీ, వాటిలోని ఉద్యోగులకు భౌతికమైన వసతులు తగ్గిపోతున్నాయి. అలాగే, ప్రభుత్వాలు, కార్పోరేట్ విభాగం, అలాగే ధనవంతులపై విధించే పన్నులను తగ్గి స్తున్నాయి. కాగా, మరో ప్రక్క వేతనాలపై పన్నులు పెరుగు తున్నాయి. అమెరికా దేశపు ప్రభుత్వ ఆదాయంలో నేడు 50% వరకు, వేతనాలపై పన్నుల నుంచే వస్తుంది. ఈ మొత్తం కార్పొరేట్ పన్నుల కంటే 4 రెట్లు ఎక్కువ. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు కార్పొరేట్ విభాగం, ప్రభుత్వ పన్నుల ఆదాయంలో 3వ వంతు భాగాన్ని సమకూర్చేది. ఇప్పుడు ఆ మొత్తం కేవలం 12%కి పడిపోయింది. బడా పారిశ్రామిక రంగం, కార్మికుల మధ్య వున్న అలిఖిత సామాజిక ఒప్పందం రద్దు అయిపోయింది. కాబట్టి, ప్రజలకు భౌతికంగా సుఖప్రద జీవితం ఇవ్వటం అనేది ఇక ఎంతమాత్రమూ లక్ష్యం కాదు. దీని వలన స్థిరమైన ప్రజాస్వామ్యంగా ఫ్రామ్ పేర్కొన్న పాశ్చాత్య దేశాల లక్ష్యం ఇక ఇప్పుడు నెరవేరే అవకాశం లేదు. నిన్నా మొన్నటి అమెరికా ఎన్నికలలో నెలకొన్న, నువ్వా నేనా అన్నట్లు వున్న పరిస్థితి, రానున్న పరిస్థితికి ఒక మచ్చుతునక.

Arrogant Capital అనే పుస్తకంలో కెవిన్ ఫిలిప్స్, నేడు అమెరికా ప్రజలలో అత్యధిక శాతం ఆ దేశ వ్యవస్థ మారాలని కోరుకుంటున్నారని పేర్కొన్నాడు. వాషింగ్‌టన్ కార్పోరేషన్లు, వాల్‌స్ట్రీట్ ధనికులు నడుపుతున్నారని అమెరికాలో హెచ్చుమంది ప్రజలు భావిస్తు న్నారు. ఈ పరిస్థితి మారాలంటే, పూర్తిగా అమెరికా వ్యవస్థే మారాలని 61% మంది అమెరికా ప్రజలు కోరుకుంటున్నారు. అంటే అమెరికా వ్యవస్థలో 'స్థిరమైన ప్రజాస్వామ్యం' నేడు సవాలుకు లోనవుతోంది. జి-7 దేశాలన్నింటిలో కూడా రాజకీయ వ్యవస్థపై ఇదే రకమైన అసంతృప్తి వుందని ఫిలిప్స్ వివరించాడు. ప్రతీ తరానికి ఒకసారి, రక్త రహిత బ్యాలట్ విప్లవంతో పునర్జీవింపబడే, రెండు పార్టీల వ్యవస్థ నేడు పతనం అంచుకు చేరుకొందని ఆయన పేర్కొన్నాడు. అమెరికా ఉద్యోగులు, గతంలో వారి ఉపాధిలో భాగంగా పొందిన సౌకర్యాలు కూడా, ఇప్పుడు అంతర్ధానమౌతున్నాయి. అంటే, వారికి గతంలో వున్న సౌకర్యాలైన ఆరోగ్యభీమా, పెన్షన్ల పథకాలు, అలాగే నిరుద్యోగ బీమా మొదలైన సౌకర్యాలు కుంచించుకుపోతున్నాయి. కాబట్టి, భౌతికంగా సుఖప్రద జీవితం అనుగుణంగా సంపద సమాన పంపిణీ, స్థిరమైన ప్రజాస్వామ్యం అని పాశ్చాత్య ప్రపంచపు లక్షణాలుగా ఫ్రామ్ పేర్కొన్న అంశాలు నేడు మారిపోతున్నాయి.

ఫ్రామ్ పేర్కొన్న మానవుడి సమర్ధ పాశ్వాలు అనే నాటి వ్యక్తీకరణకు, సమాజంలో రాను రాను అవకాశాలు కుంటుపడి పోతున్నాయి. వ్యక్తులలోనిలోపాలనే వారి వారి బలాలుగా ఆకాశానికి ఎత్తే సంస్కృతి మరింతగా వేళ్ళూను కుంటోంది. అంటే సామాజిక రుగ్మతగా ఫ్రామ్ పేర్కొన్నది నేడు మరింత నిజ మౌతుంది. వ్యక్తి బలహీనతలను అతని బలాలుగా పైకెత్తే సంస్కృతి గురించి గోధే ఈ విధంగా పేర్కొన్నాడు. నేను డబ్బు ద్వారా కొనగల్గింది, ఆ డబ్బు యజమానిగా నా స్వభావంలో భాగమౌతుంది. అంటే నా డబ్బు తాలూకు శక్తే నా శక్తి అవుతోంది. అంటే నేను ఏమిటి, ఏమి చేయగలనో అనేది, నా వ్యక్తిగతంపై ఆధారపడి లేదు. నేను కురూపిని, కాని, నేను అందమైన స్త్రీలను కొనుక్కోగలను. కాబట్టి నేను కురూపిని కాదు. అంటే నా కురూపి లక్షణాన్ని , నా డబ్బు అధిగమింపజేస్తుంది. ఇలా, వ్యక్తుల బలహీనతలే, వారి శక్తి సామర్థ్యాలుగా మారే పరిస్థితి, నేడు పెట్టుబడి కేంద్రీకరణలతో మరింతగా పెరిగిపోతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలోని, మానవుని సాధారణ మనోస్థితిని చంపివేసే అంశాలు ఒక స్థితి దాటి కొనసాగలేవని ఫ్రామ్ వివరించాడు. పాలక వర్గాల ఆధిపత్యం, దోపిడీ తాలూకు రాక్షస వ్యవస్థ క్రింద, మెజారిటీ ప్రజలు భయభ్రాంతులై, సందేహా స్పదులుగా మారే, ఒంటరితనాన్ని ఎదుర్కొనే పరిస్థితి వలన ఆ ప్రజలలో నిర్లిప్తత ఏర్పడుతుందని, వ్యక్తిగత చొరవ కొరవడు తుందనీ ఫ్రామ్ పేర్కొన్నాడు. దీనివలన, ఆ ప్రజలు తమ పాలకులకు అవసరమయ్యే విధులను కూడా నిర్వహించలేని పరిస్థితి వస్తుందని ఫ్రామ్ వివరించాడు. నేడు పాశ్చాత్య ప్రజాస్వామ్యాలలో (వాస్తవానికి ప్రపంచమంతా) పెరిగిపోతున్న అసమానతలు, అసంతృప్తి, అణచివేత ఆయా దేశాలలోని ప్రజలలో రానున్న ప్రతిస్పందనకు ముందస్తు సూచికగా వున్నాయని మనం భావించవచ్చు.

అంతిమ పరిశీలనలో ఫ్రామ్‌ను పెట్టుబడిదారీ వ్యవస్థ తాలూకు అద్భుతమైన సామాజిక విశ్లేషకుడిగా భావించవచ్చు. అలాగే ఆయన పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యక్తి అస్తిత్వం తాలూకు మౌలిక సమస్యలను కూలంకుషంగా పరిశీలించాడు. అయితే ఆర్థిక, రాజకీయ సంబంధిత అంశాలలో ఫ్రామ్ పరిశీలనలలో కొన్ని లోపాలు తొంగి చూస్తున్నాయి. పెట్టుబడి దారీ వ్యవస్థ దాని "స్వర్ణయుగం" లో వున్న కాలంలో ఫ్రామ్ రచనలు కొనసాగటం దీనికి బహుశా ఒక కారణం కావచ్చు. ఏదేమైనా పెట్టుబడిదారీ వ్యవస్థను దాని తాలూకూ మరో నూతన దృక్కోణం నుంచి మానవీయంగా పరిశీలించిన ఘనత ఫ్రామ్‌కు చెందుతుంది. ఈ విధంగా ఫ్రామ్ చిరస్మరణీయుడు. ■

\- డి.పి.రావ్

\- 'ది సేన్ సొసైటీ' పుస్తకాన్ని 'ఫాసెట్ ప్రీమియర్ బుక్స్' సంస్థ వారు సెప్టెంబర్ *1965లో ముద్రించారు.*

**మౌలిక సౌకర్యాల సూచిక**

| | మహారాష్ట్ర | కర్నాటక | గుజరాత్ | తమిళనాడు | ఆంధ్రప్రదేశ్ |
|---|---|---|---|---|---|
| సి.ఎం.ఐ.ఇ. మౌలిక సౌకర్యాల అభివృద్ధి సూచిక | 107 | 96.9 | 122.4 | 144 | 96.1 |
| సి.ఎం.ఐ.ఇ. మౌలిక సౌకర్యం అభివృద్ధి సూచిక | 106.7 | 106.1 | 105.3 | 145.6 | 104 |
| స్థాపిత విద్యుత్ ఉత్పాదన మె.వా. | 13832 | 4216 | 8506 | 6904 | 7501 |
| రోడ్ల నిడివి / 100 చ.కీ.మీ. | 117.6 | 75.1 | 46.4 | 158.8 | 58.3 |
| రైలు మార్గం నిడివి / 100 చ.కి.మీ. | 1.8 | 1.59 | 2.72 | 3.07 | 1.84 |
| టెలిఫోన్ లైన్లు / 100 జనాభా | 4.1 | 2.79 | 3.21 | 3.43 | 1.99 |

అస్సోఛాం సంస్థ చేసిన అధ్యయనం ప్రకారం గతరెండు సంవత్సరాల మధ్యకాలంలో తలసరి ఆదాయం సాంవత్సరిక పెరుగుదల ఇతర దక్షిణాది రాష్ట్రాలతో పోల్చిచూస్తే ఆంధ్రప్రదేశ్ లో తగ్గింది.

ఎకనామిక్ టైమ్స్ 9-8-02

ప్రపంచీకరణ అంటే కార్మికులు, వారి కుటుంబాలు కోరేది, అంటే మంచి ఉద్యోగం, భద్రత, నిర్ణయాల్లో భాగస్వామ్యం వారికి లభించాలి - ప్రపంచ కార్మిక సంస్థ డైరెక్టర్ జనరల్.

బిజినెస్ లైన్ 18.3.02

వినిమయ వస్తువులు కొనుక్కోవడానికి రుణ సదుపాయం కల్పిస్తే అది కొత్త ఆస్తులను, ఉత్పత్తికి తోడ్పడే ఆస్తులను సృష్టించ డానికిగాని, రుణం తీసుకున్నవారు తిరిగి చెల్లించే స్థోమతను సృష్టించ డానికి గాని తోడ్పడదు. వడ్డీ రేట్లు తగ్గిస్తే కేంద్రం తీసుకున్న రుణాల మీద వడ్డీ భారం తగ్గవచ్చు కానీ, చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం ద్వారా వచ్చే ఆదాయం తగ్గుతుంది. వడ్డీ తగ్గిస్తే, కార్పోరేట్ రంగానికి లాభాలు వచ్చి, ఆర్థిక పరిస్థితి పుంజుకొంటుందనే అంచనా ఫలించలేదు.

న్యూస్ టైమ్ 21.7.02

పట్టణాల్లో 15-28 సంవత్సరాల మధ్య వయస్సు గలిగి పని చేయటానికి సిద్ధంగా వున్నవారిలో 15.4 శాతం మంది నిరుద్యోగులుగా వున్నారు.

ఎకనమిక్స్ టైమ్స్ 11.7.02

2001-02 సంవత్సరంలో IDBI,ICICI, IFCI (కార్పోరేట్లకు రుణాలిచ్చే సంస్థలు) రు. 7684 కోట్లు మొత్తాన్ని రద్దు చేయాల్సిన మొండి బాకీల చెల్లింపులకు కేటాయించాయి.

న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 11.7.02

ప్రపంచంలో స్వేచ్ఛా వాణిజ్యం అనేది ప్రపంచ వ్యాపార సంస్థ (WTO) ఆదేశంకాగా, అమెరికా పాలపరిశ్రమకు ఎగుమతి సబ్సిడీలు ప్రకటించి WTO ఆదేశాల్ని ఉల్లంఘించ డమేకాక వర్ధమాన దేశాల పాల పరిశ్రమలను దెబ్బతీస్తుందని ఇండియన్ డైరీ అసోసియేషన్ అధ్యక్షులు అమినేష్ బెనర్జీ.

టైమ్స్ 9.7.02

అసంఘటిత రంగంలోవున్న 92 శాతం శ్రామిక జనం స్థూల జాతీయాదాయంలో 59 శాతాన్ని సమకూర్చుతున్నారు.

ఎకనామిక్ టైమ్స్ 29.5.02

సగటు ఫ్యాక్టరీ కార్మికుల జీతాలు 17 రాష్ట్రాల్లో చూస్తే ఆంధ్రప్రదేశ్, బీహార్ రాష్ట్రాలు అట్టడుగున వున్నాయి.

ఎకనామిక్ టైమ్స్ 30.5.02

దేశంలోకి విదేశాలనుంచి వచ్చిన ప్రాజెక్టు సహాయం రు. 10945.22 కో. అయితే అందులో ఆంధ్రప్రదేశ్‌కు వచ్చింది రు. 3755.84 కో. (34.3 శాతం)

ఎకనామిక్ టైమ్స్ 17.5.02

స్టుపిడ్ విధానాలనవలంబించే రాజకీయ నాయకులను వారి స్టుపిడిటీనుంచి విదేశీ సహాయం రక్షిస్తుందని ప్రొఫెసర్ పీటర్ బాయర్ హెచ్చరిక.

ఎకనామిక్ టైమ్స్ 17.5.02

అర్జంటైనాలో ఆర్థిక సంక్షోభానికి ముఖ్య కారణాలు దేశ పాలకులకు వారి ఖర్చుమీద అదుపు లేకపోవటం, హద్దూ, అదుపులేకుండా ఖర్చు చేయటం - ఐ.ఎం.ఎఫ్.

టైమ్స్ ఆఫ్ ఇండియా 2.5.02

ఏప్రిల్ 30, 2002 నాటికి రాష్ట్రంలో ఎస్.ఎస్.సి. పరీక్షలో ఉత్తీర్ణులయిన 5,69,240 మంది విద్యార్థుల్లో బహుశా ఒక లక్షమంది పై చదువులకు వెళ్ళారు. మిగతా వారు వెళ్ళకపోవడానికి పేదరికం లేదా చుట్టు పక్కల జూనియర్ కాలేజీలు లేకపోవటం కారణాలు. ప్రతి సంవత్సరం ఇదే కథ. రాష్ట్రంలో 2972 జూనియర్ కాలేజీలు ఉన్నాయి. వాటిలో ఆరు లక్షల సీట్లున్నాయి. కాని ప్రతీ సంవత్సరం 20 శాతం సీట్లు ఖాళీగా వుండి పోతున్నాయి. 2000 సంవత్సరంలో ప్రభుత్వమే చేసిన ఒక సర్వే ప్రకారం 1125 మండళ్ళకుగాను 504 మండళ్ళలోనే జూనియర్ కాలేజీలు ఉన్నాయి.

టైమ్స్ ఆఫ్ ఇండియా 2.5.02

ఏప్రిల్ - ఫిబ్రవరి 2001-2002 మధ్య కాలంలో పారిశ్రామిక ఉత్పత్తుల సూచిక రెండు శాతం పెరిగింది. అయితే ఈ కాస్త పెరుగుదల కూడా వినిమయ వస్తువుల రంగంలో ఉత్పత్తి పెరుగుదల వల్ల మాత్రమే.

టైమ్స్ ఆఫ్ ఇండియా 2.5.02

■

ప్రతీ ప్రభుత్వ సేవకు యూజర్ ఛార్జీలు వసూలు చేయాలనే ప్రపంచబాంకు మందును ప్రభుత్వం పంచి పెడుతూంది. పేదలు ఈ ఛార్జీలను చెల్లించలేరు. ఈ సేవలకు వారు దూరమవుతారు. ఉదాహరణకు ఆరోగ్యసేవలకు దైరమైతే వారి పని చేయలేరు. చవక దుకాణాల్లో అమ్మకాలుండవు. గోదాముల్లో నిల్వలు పేరుకు పోతాయి. ఇలాగ మొత్తం ఆర్థిక వ్యవస్థ మీద గొలుసుకట్టు ప్రభావం పడుతుంది.


సంకురాత్రి పండుగా...
దీపాళి పండుగా....
'చదూ'ల పండుగా....


భగమంతుడి దయవల్ల కొత్త చెప్పు, కొత్తగోచి కొన్నా......
పేదరికం తగ్గింది - వరల్డ్ బ్యాంక్


ఇవి గోద్రా మరకలు. ఆరిపోయాయి
గుజరాత్‌లో ఎలక్షన్ కమీషన్


చర్చలుంటే బూటకపు ఎన్‌కౌంటర్లా...., లేకపోతే స్వేచ్ఛాయుత ఎన్‌కౌంటర్లా.., అంతేనా సార్!....

# ఆర్థిక రంగ సమీక్ష

- వి.హెచ్

ఆర్థిక రంగంలో గత అర్ధశతాబ్ద కాలంలో చోటు చేసుకొన్న పరిణామాలు క్లుప్తంగా

పెరుగుతున్న పన్నుల బకాయిలు

తరుగుతున్న ఆహారధాన్యాల ఉత్పత్తి పెరుగుదల రేటు

ధాన్యం దండిగా పండిస్తున్నా, పెరుగుతూనే వున్న ధరలు

బడ్జెట్‌లో కేటాయింపులకు, ఖర్చుకు మధ్య పెరుగుతున్న అగాధం.

విద్యా రంగంలో దేశంలో రాష్ట్రస్థానం మరింత పతనం.

రాష్ట్రాన్ని విడవకుండా ప్రతీ సంవత్సరం సందర్శిస్తున్న మలేరియా, అతిసారా, కలరా వ్యాధులు.

తెస్తున్న రుణంలో వడ్డీ పెరుగుదల మూలాన చేతికి వస్తున్న నిధులు 1999-2000 : రుణం 1976, చెల్లింపులు 8956 కో.

దళితులకు చేస్తున్న కేటాయింపులు పూర్తిగా ఖర్చు కాని వైనం

వ్యవసాయం కార్పొరేటీకరణకు ప్రయత్నాలు ప్రారంభం.

వెనుకబాటు తనంతో ఇంకా ఇంకా కునారిల్లుతున్న అదిలాబాద్, మహబూబ్‌నగర్, ఉత్తరాంధ్ర జిల్లాలు.

పెట్టుబడి ఖర్చుల శాతం తరుగుదల.

ప్రభుత్వం ప్రతిరోజూ వేస్ అండ్ మీన్స్ అడ్వాన్సులు, ఓవర్ డ్రాఫ్టలతో కాలం గడపాల్సిన దుస్థితి.

1995లో ప్రతీదినం వడ్డీ, అసలు వాయిదాల చెల్లింపులకు ఒక కోటి రూపాయలు వెచ్చిస్తుంటే, ఈ రోజున అది 17 కోట్లు అయింది.

స్థానిక సంస్థలకు బడ్జెట్‌లో కేటాయింపులు అస్తవ్యస్థం.

సధారణ సేవల కేటాయింపుల పెరుగుదల, సామాజిక సేవల కేటాయింపుల తగ్గుదల.

పూర్తికాని నీటిపారుదల ప్రాజెక్టు పూర్తికాకుండానే కొనసాగుతున్నాయి.

అభివృద్ధికోసం చేసిన కేటాయింపులను "ఎకానమీ" పేరిట ఖర్చు చేయకపోవడం.

తీసుకొని వచ్చిన రుణాన్ని అనుత్పాదక రంగాల్లో పెట్టుబడి వల్ల, తెచ్చిన రుణాన్ని తిరిగి చెల్లించే ఆర్థిక స్థోమతను రాష్ట్రం కోల్పోయింది. ఆ రుణంతో పరిశ్రమలు పెడితే ప్రాజెక్టులు నిర్మిస్తే ఆస్తులు సృష్టికి తోడ్పడుతుంది. వాటినుంచి వచ్చే ఆదాయాన్ని రుణం తీర్చటానికి తోడ్పడుతుంది. అదే సమయంలో ప్రజల చేతుల్లో కొనుగోలుశక్తి పెరుగుతుంది. కాని జరుగుతున్న దేమంటే ఉన్న ఆస్థులు కూడా అమ్మేసుకొని దైనందిన అవసరాలకు ఖర్చు పెట్టేస్తున్నాం.

రిజర్వుబాంకు వద్దకు ప్రభుత్వం ప్రతి రోజూ పరుగెత్తి వేస్ అండ్ అడ్వాన్సులు, ఓవర్ డ్రాఫ్టులు తెచ్చుకొంటున్నామంటే దానర్థం (చేతిలో డబ్బాడడంలేదని అర్థం) నమస్యను ప్రభుత్వం ఎదుర్కొంటున్నదన్న మాట. జీత భత్యాలను చెల్లించడానికి కూడా ఖజానాలో సొమ్ము లేకపోవటం, కాంట్రాక్టర్లకు బిల్లులు సకాలంలో చెల్లించలేకపోవడం, సామాజిక సంక్షేమం కోసం చేస్తున్న కేటాయింపులను మళ్ళించడం పెట్టుబడిపద్దుకింద ఖర్చుతగ్గటం - ఇవన్నీ సమస్య నుంచి ఉద్భవించినవే.

ఎంతసేపూ ఉద్యోగస్థులను వీధిల్లోకి ఈడ్చిపారేయండి, సబ్సిడీలు నిలిపివేయండి. ఖర్చు తగ్గించుకోండి లంచగొండితనాన్ని తగ్గించండి అని జనరల్ సలహాలిచ్చే వారేగాని నిర్దిష్ట సలహాలు రావటం లేదు. ఉదాహరణకు వేసిన పన్నులను ప్రతీ నయాపైసాతో వసూలు చేస్తే, ప్రజల నెత్తిన కొత్త భారాలు దించనక్కర్లేదు. పన్నుల బకాయిలు ప్రతి సంవత్సరం పెరుగుతున్నాయని కాగ్ నివేదికలు చెబుతున్నాయి. పన్నులు చెల్లించకుండా కోర్టులకు వెళ్ళి 'స్టే' తెచ్చుకొనే వ్యాపారస్థుల ఆట కట్టించడానికి ముందు పన్ను చెల్లించండి, తర్వాత కోర్టుకు వెళ్ళండి అనే విధంగా అవసరమైతే చట్టం తీసుకొని వచ్చయినా అధికారాన్ని వినియోగించుకోండి, తర్వాత తేల్చుకోండి అని ప్రభుత్వం అనాలి కదా.

ఏడు వేల కోట్ల రూపాయలకు పైగా ఖర్చు చేసి ఏర్పాటు చేసుకొన్న నీటి పారుదల శక్తి ద్వారా సుమారు రెండు లక్షల హెక్టార్లకు పైగా వినియోగంలోకి రాలేదు. రాష్ట్రంలో 60 వేలకు పైగా ఉన్న చెరువుల్లో గణనీయమైన భాగం పూడుకొని పోయి వున్నాయి. నీటి వినియోగదారుల సంఘాలకు ఈ బాధ్యతను అప్పజెప్పి, ఆ చెరువు కింద ఆయకట్టు దార్లను సమీకరించి వారి చెరువును వారే బాగుచేయించుకొని నీరు పారించుకొని లాభం పొందాలని చెప్పాలి. రైతుకు అదనపు ఆదాయం వస్తే, ఎక్కువ పంట పండుతుంది. ప్రభుత్వానికి ఆదాయమూ వస్తుంది.

రత్నగర్భ మన రాష్ట్రం. అపార వనరులున్నాయి. విశేష ఖనిజ సంపద అటవీ సంపదలను ఇక్కడి ప్రజానీకం కోసం వినయోగించే యత్నాలు చేపట్టాలేగాని బహుళజాతి సంస్థల ద్వారా కాదు ఈ సంస్థలైనా లేదా ఆదేశాధినేతలైనా యిక్కడి సంపదల దృష్ట్యానే మన నాయకులను పలకరించేది. అంతే తప్ప వీరేదో అసహాయ సూరులని కాదు. దీన్ని గుర్తెరిగి మన వ్యవస్థ కనుగుణంగా మానవశక్తి వినియోగానికి స్థిర సంకల్పంతో కదలాలి. గ్రామీణ వ్యవస్థకనువైన పరిశ్రమలతో అటు వనరుల వినియోగం ఉపాధి లభించి నిజమైన అభివృద్ధి నమోదవుతుంది. వ్యవస్థీకృత మార్పులు ఆ వ్యవస్థకనువుగానే వుండాలి.

గ్రామీణ ప్రాంతాల్లో వ్యవస్థాత్మక మార్పు తీసుకొనిరానిదే, ఏమీ జరగదు. ఆ మర్పును తెచ్చే శక్తి సామర్థ్యాలు ప్రజల చేతుల్లోనే వున్నాయి. వారి ఐక్యత, వారి పోరాటశక్తివారి ఆయుధాలు, ఈ ఆయుధాలు కాస్త తుప్పు పట్టివున్నాయి. తుప్పు దులిపి పదును పెట్టాలి! ■